**NOTES**

శ్రీః

పండితరాజజగన్నాథవిరచితా

# కరుణాలహరీ

నాగమాతా వ్యాఖ్యాసమేతా

డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు

సంపాదకుడు

**రా మో రా**

4-103, ILTD కాలనీ ఎక్స్‌టెన్షన్,

కొత్తపేట–చీరాల–523157

పండితరాజజగన్నాథవిరచితా

# కరుణాలహరీ

"నాగమాతా" వ్యాఖ్యాసమేతా

డా॥ ఈ.ఏ.శింగరాచార్యులు

ప్రథమముద్రణ :- 02-05-2009

ప్రతులు : 500

పేజీలు : 56

వెల : రూ. 30-00



**D.T.P. :-**
**Vikram. P**
**Cell :**
**9492080750**

***Printed at :-***
**SURYA OFFSET,**
Station Road,
CHIRALA.
Cell : **9346911249**



## శ్లోకానుక్రమణికా



------

మహర్షి అన్నట్లు తాపత్రయాలు తీరి, పూర్ణంగా మునిగి చల్లబడి, ఆనందించి "నాకు ఇక పునరావృత్తి అన్నది లేదు" **"న చ పునరావర్తతే"** అనే రీతిలో అపునరావృత్తంగా మునిగి ఉండాలి. **"చిదానందోదన్వత్యనఘగుణరత్నౌఘభరితే నిమజ్జత్యన్యస్మిన్నయమపునరున్మజ్జన మిహ"** అనే సంకల్పసూర్యోదయ శ్లోకం వలె ఇక్కడి అనుభవం. **"అధోఽధః పాపాత్మా శరణద! నిమజ్జామి తమసి"** అని స్తోత్రరత్నంలో పల్కిన రీతిలో పూర్వం తమస్సులో నిమగ్నుడనై ఉండే స్థితి పోయి, నీలో నిత్యమగ్నుడనై ఉండాలని ఆశపడుతున్నాను–అని కవి హృదయం.

**॥ఇత్థం కరుణాలహరీ వివృతా శ్రీశింగరార్యనామ్నైషా।**
**సహృదయవిదుషాం ప్రీత్యైరస్య రహస్యార్థసంభరితా॥**



# పరిచయము

శ్రీ యామునాచార్యుల **'స్తోత్రరత్న'**మైన **'ఆళవన్దార్–స్తోత్రమ్'**, శ్రీ కులశేఖరుల **'ముకున్దమాల'**, పండితరాజ బిరుదాంకితుడగు మహాకవి జగన్నాథవిరచితమైన **'కరుణాలహరీ'** స్తోత్రమునకు ఆధారభూతమైనవి. ఈ స్తోత్రముల మధ్యనున్న పెక్కు సామ్యములను ఈ ఆంధ్ర వ్యాఖ్యానంలో పొందుపఱచి **'నాగమాతా'** అని దానికి పేరిడి అందించినవారు **డా॥ ఈ.ఏ. శింగరాచార్యులుగారు.**

వీరిని 'తులసీమాత' వెన్నంటి ఉండుగాక.

–సంపాదకుడు

**'రామోరా'**





ఉండే భాగ్యాన్ని పొందిన, సంపూర్ణలక్ష్మీవిలాసం కల, సమస్త మాధుర్యాలకు వాసస్థానం అయిన శ్రీకృష్ణముఖచంద్రుని నా మనస్సు చకోరంవలె ఆస్వాదించి ఆస్వాదించి, ఆనందించి ఉజ్జీవించాలి. చకోరపక్షి చంద్రకళలతోనే జీవిస్తుందని ప్రసిద్ధి. కృష్ణుని ముఖచంద్రుని మాత్రమే నేను ఆస్వాదించి, ఆస్వాదించి బతకాలి.

**శ్లో॥ సురస్రోతస్విన్యాః పులినమధితిష్ఠన్ నయనయోః**
**విధాయాంతర్ముద్రామధి సపది విద్రావ్య విషయాన్।**
**విధూతాంతర్ధ్వాంతో మధురమధురాయాం చితి కదా**
**నిమగ్నః స్యాం కస్యాంచన నవనభస్యాంబుదరుచి॥ 60**

**ప్రతిపదార్థము :** సురస్రోతస్విన్యాః=దేవగంగ అయిన గంగామహానదియొక్క, పులినమ్= ఇసుక తిన్నెలో, అధితిష్ఠన్=ఆసీనుడనై, నయనయోః=నా రెండు కన్నులను, అన్తః ముద్రాం విధాయ=లోపల తిరిగి అంతర్ముఖం అయేటట్లు చేసి, ముద్రనువేసి, సపది=వెంటనే, ఆక్షణమే, విషయాన్=బాహ్యేంద్రియ విషయాలను, విద్రావ్య=తరిమికొట్టి, విధూతాంతః ధ్వాంతః=అంతర తమస్సును అంతటినీ ఎగురగొట్టి, నవనభస్యాంబుదరుచి= భాద్రపద మాసంలోని కొత్తమేఘంవంటి వర్ణాన్ని కల, కస్యాంచన=వర్ణనకు అందని, మధుర మధురాయామ్=మిక్కిలి తీయని, (మధురమైన మధురలో వసించిన) చితి= చైతన్యంలో (పరబ్రహ్మలో) కదా=ఎపుడో కదా, నిమగ్నః స్యామ్=పూర్తిగా మునిగినవాడను కాగలను?

**భావము :** శ్రీకృష్ణపరబ్రహ్మచైతన్యంలో నేను పూర్తిగా నిమగ్నుడనై, దివ్యసూరుల వలె (ఆళ్వారుల వలె) కాగలను అని కవి ఆశపడుతున్నాడు. భగవానుని పాదతీర్థం అయిన గంగలో అవగాహించి, ఆ నదీపులినంలో కూర్చుండి శ్రీకృష్ణుని ధ్యానిస్తూ **"ఆవృత్తచక్షుః"** అని ఉపనిషత్తు పల్కిన రీతిలో కన్నులను లోపల శ్రీకృష్ణునివైపు త్రిప్పి, మనస్సులోని మాలిన్యాన్ని తుడిచివేసి, విషయాలను అన్నిటినీ బాహ్యంగా తరిమికొట్టి, అంతర్ధ్వాంతాన్ని వెడలగొట్టి, అమృతంకంటె తీయని, మధుర మధురం అయిన జ్ఞానానంద ఘనస్వరూపుడైన, మేఘవర్ణుడైన శ్రీకృష్ణునిలో నేను గాఢంగా, గంభీరంగా ఎపుడు మునిగి ఉంటానో కదా!

శ్రీకృష్ణచైతన్యామృతాబ్ధిలో నేను పూర్ణంగా మునిగినవాడను కావాలని ఆశపడుతున్నాను. ఆ సముద్రంలో తాను కూడా ఒక ఆళ్వార్లు (భగవానుడనే సముద్రంలో మునిగేవారు) కావాలి– అని కవి ఆశపడుతున్నారు కాబోలు! ఆళ్వారుల అనుభవాన్నే కదా యామునులు కూడా ఆశించారు (ఆళ్వారు అంటే తమిళంలో అవగాహిస్తున్న వారని అర్థం). **"మధురమధురాయామ్"** అనే దానికి మధురమైన మధురలో నివసించే అనే అర్థం కూడా చెప్పవచ్చు. **"ఏష బ్రహ్మ ప్రవిష్టోఽస్మి గ్రీష్మే శీతమివ హ్రదమ్"** అని

**త్వన్నయనారుణోదయః"**– నీ కటాక్షారుణోదయం ఎపుడు నా అజ్ఞాన రాత్రిని తెల్లవారేటట్లు చేస్తుందో కదా–అని అన్నాడు. ఇక్కడ చివరలో సూర్యోదయం తిరునామం వల్లనే సిద్ధిస్తుందని అంటున్నాడు. క్లేశాలు వృక్షాలవలె శాఖోపశాఖలుగా వృద్ధి పొందుతున్నవి. వాటిని భస్మం చేసే అగ్ని ఈ రెండక్షరాలు. **(జ్ఞానాగ్నిః దగ్ధకర్మాణి భస్మాసాత్కురుతే)** అని శ్రీకృష్ణుడు గీతలో అన్నాడు. ఈ కవి కృష్ణనామమే దానిని నిర్వహిస్తుంది అని ఇక్కడ పల్కుతున్నాడు. ఇదే మోక్షద్వారం. పరమపదవాకిలి.

**శ్లో॥ విశాలవిషయాటవీవలయలగ్నదావానల–**
**ప్రసృత్వరశిఖావలీవిగలితం మదీయం మనః।**
**అమందమిళదిందిరే నిఖిలమాధురీమందిరే**
**ముకుందముఖచందిరే చిరమిదం చకోరాయతామ్॥ 59**

**ప్రతిపదార్థము :** విశాల=విస్తృతమైన, విషయ+అటవీవలయ=విషయాలు అనే అరణ్యమండలంలో, లగ్న=తగులుకొన్న, దవానల=దావాగ్ని, కారుచిచ్చునుండి, ప్రసృత్వర=వ్యాపించే, శిఖావలీ=అగ్నిజ్వాలల సమూహంచేత, విగలితమ్=భ్రష్టమైనది–జారిపోయినది–బాధింపబడినది, అయిన, ఇదమ్=ఈ, మదీయం మనః=నా మనస్సు, అమందమిళదిందిరే =గట్టిగా–దృఢంగా–ఆలింగనం చేసికొన్న లక్ష్మితో (కపోలాలతో) కూడినది, నిఖిల మాధురీమందిరే=అన్ని తీయదనాలకు నివాసగృహం అయిన, ముకుందముఖచందిరే= అమృతమనబడే మోక్షాన్ని ఇచ్చే కృష్ణుని ముఖచంద్రునియందు, చిరమ్=చిరకాలం, చకోరాయతామ్=చకోరపక్షివలె దాని కాంతిని తాగి, దానినే ధారకంగా కల్గినదిగా కావాలి.

**భావము :** ఈ కృతి ఆరంభంలో "విషాగ్ని వంటి దుఃఖభూమి అయిన సంసారంలో –సంసారాగ్ని జ్వాలలతో చాలా లోపించిన చైతన్యాన్ని కల్గిన"–**"విషానలోపమే విషాదభూమౌ భవసాగరే విభో"**–అని పల్కిన సూక్తివంటిదే ఇది కూడా. "విశాలమైన విషయ కాంతారాలలో లగ్నమై, మండే అగ్నిజ్వాలల చేత తపింపబడ్డ నా మనస్సు" అని ఇక్కడ అంటున్నాడు. తపింపబడ్డ మనస్సును ఉజ్జీవింపచేయడానికి అమృతం కావాలి. జ్వాలలవల్ల కల్గిన తాపాన్ని తీర్చడానికి, బ్రతికించడానికి కావలసిన అమృతాన్ని ముకుందముఖ చంద్రుడు వర్షిస్తాడు. కృతి ప్రారంభంలో **"రమాముఖాంభోజవికాసన క్షమః"** అని లక్ష్మి ముఖపద్మంయొక్క వికాసాన్ని కలిపి అనుభవించినట్లే ఇక్కడ కూడా ఆ లక్ష్మియొక్క కపోలాలతో యథేష్టంగా ఆలింగనం చేసికొని కలిసి ఉండే భాగ్యాన్ని కల ముఖచంద్రుడు అని కవి అంటున్నాడు. **"ఆసత్తి యోగాదవిరళితకపోలమ్"** అని ఉత్తరరామచరితంలో సీతతో రాముడు పల్కిన వచనం స్మరణీయం. **"గాఢాలింగన సంగపీడితముఖమ్"** అని ముద్రారాక్షసప్రయోగం. పూర్ణం అయిన లక్ష్మితో కూడిన ముఖం అని కూడా అర్థాన్ని గ్రహించవచ్చు. **"అఖిలం మధురమ్"**– అని వల్లభాచార్యులు– అనుభవించినట్లే **"నిఖిలమాధురీమందిరమ్"** అని కవి అంటున్నాడు. లక్ష్మియొక్క కపోలాలతో కూడి

# మంగళాశీస్సు



**"కరుణాలహరీ"** అనబడే ఈ గ్రంథాన్ని రచించిన కవి మహాప్రసిద్ధుడు, సర్వశాస్త్ర నిపుణుడు, మధురవాగ్విశారదుడు అయిన పండిత జగన్నాథరాయలు. ఇతడు మొగల్ చక్రవర్తి షాజహాన్‌కు, అతని ప్రధానాధికారి అసఫ్‌ఖాన్, ముకుందరాయుడు మొదలైన వారికి చాలా సన్నిహితుడు. ఢిల్లీ చక్రవర్తి షాజహాన్ ఈ కవిని **"పండితరాజ"** బిరుదాన్ని ఇచ్చి సత్కరించాడు. "ఢిల్లీచక్రవర్తి నా యౌవనంలో నన్ను తన అరచేతిలో పెట్టుకొని పెంచాడు. ఇపుడు వయస్సు ముదిరి, నేను విశ్వనాథుని క్షేత్రనగరం అయిన కాశిలో కాలం గడుపుతున్నాను" అని తనను గూర్చి ఈ కవి స్వయంగా చెప్పుకొన్నాడు. ఇతడు వెలయించిన **"అసఫ్‌ఖాన్ విలాసమ్"** అనే అందమైన కావ్యంయొక్క అవతారికలో "దేశానికి అంతా మహోపకారాన్ని చేసేవారు, పరమరసికులు అయిన మహావిద్వాంసులచేత ఎల్లప్పుడు పరివేష్టింపబడి, వారితో పొందిన రసానుభవంచేత వికసితమైన మనస్సును కలవాడు, కలియుగాన్ని కృతయుగంగా మారేటట్లు చేసేవాడు, కంటకావృతం అయిన వేదాంతారణ్యకమార్గాన్ని అకంటకంగాను, అనాకులంగాను విద్వద్వరేణ్యులద్వారా చేయించేవాడు, అసఫ్‌ఖాన్ ప్రభువుయొక్క అనుగ్రహం మూర్తీభవించినట్లున్నవాడు అయిన ముకుందరాయని ఆజ్ఞపై షాజహాన్ చక్రవర్తిచే **"పండితరాజ"** బిరుదంతో సత్కరింపబడి, ఆ బిరుదుతో ప్రకాశించేవాడు, తైలింగ కులశిరో భూషణం అయిన జగన్నాథునిచే ఈ ఆఖ్యాయిక రచింపబడినది' అని తెలుపబడినది. ఇతడు భట్టోజీదీక్షితునకు (వైయాకరణ సిద్ధాంతకౌముదికర్త), అప్పయ్యదీక్షితులకు సమకాలికుడు. భట్టోజీదీక్షితునకు, జగన్నాథునకు మధ్య ప్రబలవైరం ఉండేది. భట్టోజీ దీక్షితులు రచించిన ప్రౌఢవ్యాకరణ గ్రంథాలను జగన్నాథుడు ఖండించాడు. భట్టోజీ దీక్షితకృతం అయిన **ప్రౌఢమనోరమ**ను **"ప్రౌఢమనోరమాకుచమర్దనమ్"** అనే గ్రంథంతో ఖండించాడు. అన్ని శాస్త్రాలలో పరిణతమైన పాండిత్యాన్ని కల ఇతడు ఏ శాస్త్రంలోను ఎవ్వరికీ ఏ అవకాశం ఇవ్వలేదు. ఇక, అలంకారశాస్త్రంలో అయితే చాలా నిపుణుడు. అప్పయ్యదీక్షితులు ఉత్తరదేశయాత్రకు పోయినపుడు భట్టోజీదీక్షితులు ఆయనవద్ద వేదాంతగ్రంథాధ్యయనాన్ని చేశాడు. భట్టోజీకి, పండితరాయలకు మధ్య ఒకసారి వాగ్వాదం సంభవించినపుడు మధ్యస్థుడైవున్న అప్పయ్యదీక్షితులు తన శిష్యుడైన భట్టోజీ విషయంలో పక్షపాతాన్ని ప్రదర్శించాడని తలచిన పండితరాయలు దీక్షితకృతాలైన అలంకారశాస్త్రగ్రంథాలు–చిత్రమీమాంసా, కువలయానందం మొదలైనవానిని బలంగా దూషించి, రసగంగాధరమనే గొప్ప అలంకారశాస్త్రగ్రంథాన్ని రచించాడు. కువలయానందంలో ప్రతివస్తూపమాలంకార నిరూపణావసరంలో – **"తవామృతస్యందిని పాదపంకజే నివేశితాత్మా కథ మన్యదిచ్ఛతి,**

**స్థితేఽరవిందే మకరందనిర్భరే మధువ్రతో నేక్షురకం హి వీక్షతే"** – అనే స్తోత్రరత్నశ్లోకాన్ని ఉదహరించి, దాని తాత్పర్యాన్ని మనోహరంగా వివరించాడు. భగవద్యామునుల ఈ శ్లోకం మహాకవి, మహాభక్తుడు అయిన పండితరాయల మనస్సును దోచుకున్నది. ఆ శ్లోకానికి దీక్షితులు చేసిన వ్యాఖ్యానం కూడా ఇతని మనస్సును ఆకర్షించినది.

దీక్షితుల గ్రంథాన్ని ప్రత్యాఖ్యానం చేసిన పండితరాయలు ఈ సందర్భంలో మాత్రం దీక్షితుల వ్యాఖ్యానాన్ని అంగీకరించాడు. మహాకవి అయిన యామునులు 'స్థితః' అనే ప్రయోగించి ఉంటారని కూడా చెప్పాడు. కువలయానంద వ్యాఖ్యానం అయిన రసికరంజనిని రచించిన గంగాధరవాజపేయి జగన్నాథపండితుడు సూచించిన **"స్థితః"** అనే పాఠమే ద్రాక్షామధురం అయిన యామునుల కవిత్వానికి అనుగుణం" అని ప్రశంసించాడు. తమకు గల ఢిల్లీచక్రవర్తి వాల్లభ్యంతో దక్షిణభారతప్రాంతంలోని స్తోత్రరత్నాన్ని తెప్పించి, దానిని అనుభవించి, దానివలెనే తన నిరతిశయభక్తికి విషయభూతుడైన శ్రీకృష్ణుని విషయంగా చేసికొని, అదే రీతిలో అఱవై శ్లోకాలను కల **"కరుణాలహరీ"** అనే ఈ ప్రస్తుత స్తోత్రకావ్యాన్ని రచించాడు. స్తోత్రరత్నంలో 64శ్లోకాలున్నాయి. మొదటి మూడు శ్లోకాలు ఆ గ్రంథానికి మంగళంగా, తమ ప్రాచార్యులైన నాథమునుల నమస్కారరూపంగా ఉన్నాయి. **"పితామహం నాథమునిం విలోక్య ప్రసీద మద్వృత్తమచింతయిత్వా"** (65) (పితామహులైన నాథమునులను పురస్కరించుకొని, నా శీలవృత్తాదులను చింతించకుండా నాకు అనుగ్రహించాలి) అనే చివరిశ్లోకం కూడా నాథమునుల సంబంధవిశేషకీర్తనపరం. మిగిలిన 60 శ్లోకాలు మొత్తం భగవత్ స్తోత్రపరం. ఈ సంఖ్యను పండితరాయలు ఆదరిస్తూ కరుణాలహరిని రచించాడు. ఈ రెండు స్తుతుల మధ్య ఉండే పలు సామ్యాలు వ్యాఖ్యానంలో ఆయా సందర్భాలలో సంగ్రహంగా ప్రస్తావించబడతాయి. పూర్వం బొంబాయి నగరం ద్వారా ప్రచురింపబడ్డ కావ్యమాలలో ఈ స్తుతిమూలం ముద్రింపబడింది. మధురరసఘనం అయిన ఈ కావ్యాన్ని సుమారు 50సంవత్సరాలకు పూర్వం తిరుచ్చినాపల్లిలోని ప్రసిద్ధ విద్వాంసులు శ్రీ ఎ.వి.గోపాలాచార్యులుగారు నాతి విస్తృతం అయిన చక్కని వ్యాఖ్యను రచించారు. ప్రస్తుత వివరణం దానిని ఆధారంగా చేసికొని వ్రాయబడింది. **"విధూతాంతర్ధ్వాంతో మధురమధురాయాంచితి కదా నిమగ్నః స్యాం కస్యాంచన నవనభస్యాంబుదరుచి"** అని అంటూ పండితరాయలు దివ్యసూరుల రీతిలో అనుభవమగ్నతాస్థితిని పొంది ఈ స్తుతిని ముగించడం చాలా ఆశ్చర్యకరం. ఈ వ్యాఖ్యారచనలో ప్రేరణను కల్గించిన సాహితీరసికులు, పోషకులు, మన్మిత్రం **శ్రీరావి మోహనరావు**(చీరాల) గారికి నా హృదయపూర్వక కార్తజ్ఞ్యాన్ని హార్దంగా వ్యక్తం చేస్తున్నాను.

**– డా॥ ఈ.ఏ.శింగరాచార్యులు**



మనస్సు ఎక్కడికి చుట్టి తిరిగినా, అన్నిటినీ విడచి, **"మామేకం శరణం వ్రజ"** అని శ్రీకృష్ణునే శరణు వేడితేనే నిజమైన, యథార్థం అయిన శాంతి సిద్ధిస్తుంది. **"మామ్ ఏకమ్ శరణం వ్రజ"** అని అన్నాడు కృష్ణుడు. "కృష్ణ" అనే రెండక్షరాలను కల నామాన్నే శరణాన్ని పొందు అని అంటున్నాడు ఈ కవి. **"నామోచ్చారణభేషజాత్, నశ్యంతి సకలా రోగాః సత్యం సత్యం వదామ్యహమ్"** అని స్థిరీకరింపబడ్డ ప్రభావాన్ని కల తిరునామంతో తీరే రోగాలలో సంసారరోగం కూడా ఒకటి. అందులో పాపరోగం కూడా చేరినదే. ముకుందమాలలోని **"ప్రసూతిమరణవ్యాధేః చికిత్సా మిమాం యోగజ్ఞాః సముదాహరంతి మునయో యాం యాజ్ఞవల్క్యాదయః, అంతర్జ్యోతి రమేయమేకమమృతం కృష్ణాఖ్య మాపీయతాం తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణ మాత్యంతికమ్"** అనే శ్లోకార్థం ప్రకృతంలో కవి హృదయగతమైనది. తరువాతి శ్లోకంలో ఇది అంతా సుస్పష్టం.

**శ్లో॥ వజ్రం పాపమహీభృతాం భవగదోద్రేకస్య సిద్ధౌషధమ్**
**మిథ్యాజ్ఞాననిశావిశాలతమసస్తిగ్మాంశుబింబోదయః।**
**క్రూరక్లేశమహీరుహాముపురుతరజ్వాలాజటాలః శిఖీ**
**ద్వారం నిర్వృతిసద్మనో విజయతే కృష్ణేతి వర్ణద్వయమ్॥ 58**

**ప్రతిపదార్థము :** కృష్ణ+ఇతి వర్ణద్వయమ్=కృష్ణుడనే రెండక్షరాలు, పాపమహీభృతామ్=పర్వతాలవంటి పాపాల(రెక్కలను ఛేదించే), వజ్రమ్=వజ్రాయుధంగా, భవగద+ఉద్రేకస్య=సంసారం అనే రోగంయొక్క విజృంభణను, (నివృత్తి చేసే), సిద్ధౌషధమ్=సిద్ధమైనమందుగా, మిథ్యాజ్ఞాన=అసత్యమైన జ్ఞానం అనే, నిశా=రాత్రియొక్క, విశాలతమసః=గొప్ప చీకటిని పోగొట్టే, తిగ్మాంశుబింబోదయః=సూర్యమండలంయొక్క ఉదయంగా, క్రూర=క్రూరమైన – కఠినమైన, క్లేశమహీరుహామ్=క్లేశాలనే వృక్షాలను (భస్మంచేసే), ఉరుతర జ్వాలాజటాలః =చాలా గొప్పజ్వాలలలో పెనవేసికొన్న, శిఖీ=నిప్పుగా, నిర్వృతి సద్మనః= మహానందానికి స్థానం అయిన పరమపదానికి చేర్పించే, ద్వారమ్=వాకిలిగా ఉంటూ, విజయతే=మఱింత మఱింత ఉత్కర్షతో వర్ధిల్లుతున్నది.

**భావము :** "ఓ మనసా! నాకు నీవు నిజాన్ని చెప్పాలి. సంసారంలో కోట్లానుకోట్ల జన్మలలో నీవు చుట్టిరాని చోటులేదు. **"కృష్ణ"** అనే రెండు అక్షరాల మాధుర్యాన్ని నీవు ఎక్కడైనా చూచావా? అని అంటూ ఈ కవే మఱొక శ్లోకంలో అన్నాడు. అదే రీతిలో ఇక్కడ కూడా ఈ రెండు అక్షరాలు అన్ని దుఃఖాలను తీరుస్తుంది–అని అంటున్నాడు. పర్వతాల వంటి పాపాలు మనలను సంసారంలో పుట్టేటట్లు చేస్తున్నవి. పాపపర్వతాల రెక్కలను ఇంద్రుని వజ్రాయుధంవలె భేదిస్తున్నవి. పాపశాలలను భేదించి, చూర్ణం చేస్తున్నవి. సంసారమనే రోగాన్ని తీర్చే సిద్ధౌషధం అవి. అజ్ఞానాంధకారాన్ని తఱిమికొట్టే సూర్యోదయం. ఈ స్తుతి ఆరంభంలో కవి 6వ శ్లోకంలో **"కదా మదజ్ఞానవిభావరీం హరే! హరిష్యతి**

పాడినవాడవు నీవు. పాడించినది నీవు. మాయకవివై వచ్చి నా మనస్సులో, ఆత్మలో కలిసి ఉన్నావు. నీవే నేనై, నిన్ను నీవే స్తుతించుకొని నాకు తేనెవలె, పాలువలె, కలకండవలె, అమృతంవలె భోగ్యుడవై ఉన్నావు (**"ఎనక్కు త్తేనే పాలే కన్నలే యముదే"** అని శఠకోపసూరి సూక్తి) కవిత్వంలో నీవు నేర్పిన అభ్యాసం అన్నది పూర్తిగా మఱచి అహంభావం మథించి, "నా స్తుతి, నా మధుర వాక్కు" అని నీవు గ్రహించేటట్లు అంటున్నాను. సర్వజ్ఞుడవైన నీముందు నీ వస్తువును "నాది" అని నేను పల్కడంలో సిగ్గుపడవద్దా! తెలియని మిగిలిన వారిని మోసగించవచ్చు. సర్వజ్ఞుడవైన నిన్నే మోసపుచ్చాలని చూడడం సిగ్గులేనితనమే. ఈ శ్లోకంయొక్క మాధుర్యమే చాలు ఈ కవి మహాకవి అని కీర్తించడానికి. **"ఎనదు ఎన్బదెన్? యాన్ ఎన్బదెన్?"** (నాది అనేది ఏది? నేను అనేది ఏది?) అనే శఠకోపసూరి వలె విరమించి, "నేను" అన్నదానిని విడచి, **"తానే యానెన్బానార్"** (తానే నేనుగా అయినాడు) అని నిర్ణయించి, అతనిని ఆశ్రయించి ఉండడమే యుక్తం. **"అవన్ ఎన్ ఆకి నినొళిన్దాన్"** (అతడు నేనై నిలచి ఉన్నాడు) అని శఠకోపసూక్తి. **"ఇమాం వై విష్ణులహరీం జగన్నాథేన నిర్మితామ్, యః పఠేత్ తస్య సర్వత్ర జాయంతే జయసంపదః"** అనే శ్లోకం ఒక ప్రతిలో మాత్రం ఉన్నది. నాచే రచింపబడినది **"జగన్నాథేన నిర్మితామ్"** అని సిగ్గులేనివాడనై అంటున్నాను. జగన్నాథుడైన శ్రీకృష్ణునిచే నిర్మింపబడినది అని ఇక్కడి తత్త్వార్థం. ఈ రెండు అర్థాలు వచ్చేటట్లుగా కవి **"జగన్నాథేన నిర్మితామ్"** అని ప్రయోగించాడు కాబోలు.

**శ్లో॥ పాతాళం వ్రజ యాహి వా సురపురీమారోహ మేరోశ్శిరః**
**పారావారపరంపరాం తర తథాప్యాశా న శాంతా తవ।**
**ఆధివ్యాధిజరాపరాహత! యది క్షేమం నిజం వాంఛసి**
**శ్రీకృష్ణేతి రసాయనం రసయ హే శూన్యైః కిమన్యైః శ్రమైః॥ 57**

**ప్రతిపదార్థము :** (మనసా), పాతాళమ్=పాతాళానికి, వ్రజ=వెళ్ళు, సురపురీం వా=లేక, స్వర్గానికి, యాహి=వెళ్ళు, మేరోః శిరః=మేరుపర్వతంయొక్క శిఖరాన్ని, ఆరోహ=అధిరోహించు, పారావారపరంపరామ్=సముద్రాల వరుసను, తర=దాటు, తథాపి=అయినా, ఇన్నిచేసినా, తవ=నీకు, ఆశా=ఆశ, న శాంతా=ఉపశమించలేదు, ఆధి=మనోవ్యాకులాల చేత, వ్యాధి=వ్యాధులచేత, రోగాలచేత, జరా=ముసలితనంచేత, పరాహత=వేధింపబడే, హే=ఓ మనస్సా!, నిజమ్=నీకు చెందిన, క్షేమమ్=క్షేమాన్ని, యది వాంఛసి=నీవు కోరుతున్నట్లయితే, శ్రీకృష్ణేతి="**శ్రీకృష్ణ**" అనే, రసాయనమ్=రసాయనాన్ని, బలవర్ధక ఔషధాన్ని, రసయ=ఆస్వాదించి, ఆనందించు, శూన్యైః=రిక్తాలైన, ప్రయోజనం లేని, అన్యైః =మిగిలిన, శ్రమైః=అలసటలచేత, కిమ్=ఏమి ఫలం?

**భావము : "ఉత్పతన్నపి చాకాశం విశన్నపి రసాతలమ్, అటన్నపి మహీం కృత్స్నాం"**– ఎక్కడకు భ్రమిస్తూ పోతే ఏమి? **"త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః"**–



శ్రీః

పండితరాజజగన్నాథవిరచితా

# కరుణాలహరీ

**శ్లో॥ విషీదతా నాథ! విషానలోపమే**
**విషాదభూమౌ భవసాగరే విభో।**
**పరం ప్రతీకారమపశ్యతాఽధునా**
**మయాయమాత్మా భవతే నివేదితః॥ 1**

**ప్రతిపదార్థము :** నాథ=స్వామీ!, విభో=అంతటావ్యాపించి ఉండే ప్రభూ!, విషానలోపమే=విషాగ్నివంటిది, విషాదభూమౌ=దుఃఖాలకు జన్మస్థానం అయిన, భవసాగరే=సంసార సముద్రంలో, విషీదతా=విషాదాన్ని పొందినవాడను, పరమ్=(నిన్ను తప్ప) ఇంకొకరిని, ప్రతీకారమ్=శోకాన్ని తీర్చే ఉపాయంగా, అపశ్యతా=చూడలేని, మయా=నాచేత, అయమ్ ఆత్మా=ఈ ఆత్మ, అధునా=ఇప్పుడే, భవతే=నీ కొఱకు, నివేదితః=సమర్పింపబడింది.

**భావము :** జగన్నాథ పండితరాయలు సకలశాస్త్రనిష్ణాతుడు. వ్యాకరణం, అలంకారం, వేదాంతం–మొదలైన శాస్త్రాలలో అద్భుతమైన గ్రంథాలను రచించినవాడు. ఈ కవి శ్రీకృష్ణుని పట్ల అంతులేని భక్తిని కలవాడన్నది ప్రసిద్ధం. షాజహాన్ అనే మొగల్ చక్రవర్తి ద్వారా **"పండితరాజ"** బిరుదాన్ని అందుకొన్నవాడు ఈ మహాకవి. అప్పయ్య దీక్షితుల కువలయానంద గ్రంథాన్ని ఖండించేటపుడు జగన్నాథుడు అందులో ప్రతివస్తూపమాలంకారానికి లక్ష్యంగా ఉదహరించిన **"తవామృతస్యందిని"** (27) అనే స్తోత్రరత్న శ్లోకాన్ని ప్రస్తావిస్తూ, ఆ శ్లోకంలో **"స్థితోఽరవిందే"** అనే పాఠం **"స్థితేఽరవిందే"** అనే పాఠంకంటే సమంజసం, కవిహృదయానుగుణం అని నిశ్చయించాడు. అంతేకాక, ఈ శ్లోకం "ఆళవన్దారుశ్లోక"మని కూడా అన్నాడు. కువలయానందానికి **"రసికరంజనీ"** వ్యాఖ్యానాన్ని రచించిన గంగాధరవాజపేయి కూడా **"అరవింద భవసుందరీవదనారవింద నిర్గలన్మకరందధారా సందోహలుఠదతనురామణీయకః పదసందర్భో నిఖిలసరసహృదయసంవాది కవేరీదృశసందర్భఘటనావైదగ్ధ్యం సూచయతీతి యుక్తం ప్రతీమః"** అని జగన్నాథుడు చూపిన పాఠాన్ని సమర్థిస్తూ పలికాడు. అంతేకాక శ్రీయామునుల కవితావైభవాన్ని కూడా ప్రశంసించాడు. **"ఆళవన్దారు శ్లోక"**మనే నిర్దేశం కువలయానందంలో లేదు. పండితరాయలు ఈ శ్లోక సౌందర్యానికి ముగ్ధుడై, తనకు ఢిల్లీ ప్రభువు వద్ద ఉన్న పలుకుబడితో దక్షిణదేశంనుండి ఆళవన్దారు స్తోత్రాన్ని

(స్తోత్రరత్నాన్ని) తెప్పించి, దానిని చదివి, దానిని పోలినది, శ్రీకృష్ణుని విషయంగా కల్గినది అయిన ఈ కరుణాలహరిని రచించాడు-అనే అంశం సుస్పష్టం. శ్రీయామునుల స్తోత్రరత్నంలోని శ్లోకాలను, శ్రీకులశేఖరుల ముకుందమాలలోని శ్లోకాలను జగన్నాథుడు మనస్సులో అనవరతం భావించిన భావనావిశేషంవల్ల వాటి భావాలు ఈ కరుణాలహరిలో ప్రతిబింబిస్తున్నవి అని అనడం చాలా సమంజసం.

ఈ స్తోత్రం **"విషీదతా"** అనే పదంతో ఆరంభం అవుతున్నది. కవి శ్రీకృష్ణుని పాదసన్నిధిలో తన ఆత్మసమర్పణాన్ని చేసి, శరణాగతి చేస్తున్నాడు. శ్రీయామునులు చూపిన మార్గాన్నే అనుసరిస్తున్నాడు. **"న హి ప్రపశ్యామి మమానుపద్యాత్ యచ్ఛోకమ్"**– బాధపడుతున్న నా శోకాన్ని తీర్చడానికి తగిన వేఱొక శరణాన్ని నేను చూడలేకున్నాను అని గీతలో అర్జునుడన్నాడు. ఆ భావాన్నే జగన్నాథుడు **"పరం ప్రతీకారమపశ్యతా"** అని అంటూ వ్యక్తం చేశాడు. **"అకించనోఽ నన్యగతిః శరణ్య! త్వత్పాదమూలం శరణం ప్రపద్యే"** అని అంటూ యామునులు స్తోత్రరత్నంలోని 22వ శ్లోకంలో వ్యక్తం చేసిన భావం ఈ కృతిలోని మొదటి శ్లోకాలలో అనుసంధింపబడింది. **"క్రందామి సంప్రత్యగతి స్తవాగ్రే", "తదహం తవ పాదపద్మయోరయమద్యైవ మయా సమర్పితః"** అనే స్తోత్రరత్నంలోని ప్రయోగాల భావాలు ఈ మొదటి శ్లోకంలో స్ఫురిస్తున్నవి. ఇవి అన్నీ శరణాగతి చేసే శ్లోకాలు. **"అయ మద్యైవ మయా సమర్పితః"** అనే భావాన్ని అనుసరించి **"అధునా మయాయమాత్మా భవతే నివేదితః"** అని ప్రయోగింపబడినది. **"నివేదయత మాం క్షిప్రమ్"** అని అంటూ విభీషణుడు పల్కిన పల్కులను అనుసరిస్తూ **"నివేదితః"** అని ప్రయోగింపబడింది. **"శరణ్య! తేఽ ఙ్ఘ్రిమహమయామ్"** అని అంటూ తరువాతి శ్లోకంలో **"శరణ్య! త్వత్పాదమూలం శరణ ప్రపద్యే"** అనే భావం అనుసరింపబడింది. యామునుల స్తోత్రరత్న ప్రారంభంలోని మూడు శ్లోకాలలో నాథశబ్దం ప్రాచార్యులైన నాథమునుల విషయంగా ప్రయోగింపబడింది. మొదటి శ్లోకంలో **"నాథాయ మునయే"** అని, రెండవశ్లోకంలో **"నాథాయ నాథమునయే"** అని మూడవ శ్లోకంలో **"నాథమునయే"** అని ప్రయోగింపబడింది. చివరి శ్లోకంలో కూడా **"పితామహం నాథమునిం విలోక్య"** అని ప్రయోగింపబడింది. స్తోత్రం మధ్యలో **"మమ నాథ"** అని, **"సకృదేవ నాథ"** అని, **"నాథ న తేఽ నురూపః"** అని భగవత్పరంగా నాథనామసంకీర్తనం చేయబడింది. జగన్నాథుడు కూడా ఈ పదాన్ని ఆదరిస్తూ ప్రారంభంలోనే **"విషీదతా నాథ"** అని శ్రీకృష్ణుని పరంగా ఈ పదాన్ని ప్రయోగించాడు. ఈ సంసారభూమి నిప్పు అని చెప్పవలసి ఉన్నది. ఆ నిప్పులోను **"విషానలోపమే విషాదభూమౌ"** విషాగ్ని ఇది అని కవి ప్రయోగం. ఈ ప్రయోగం స్తోత్రరత్నంలోని **"సంసారదవాశుశుక్షణిమ్"** అనే ప్రయోగాన్ని తలపిస్తుంది. **"విషాదభూమి" - దుఃఖభూమి.** దుఃఖానికి స్థానం-అనడానికి మాత్రమే భూమి అనే పేరు తగినది అని భావం. భూమిని **"స్థిరా"** అని అనడం సరి కాదు. ఇది నిరంతరం దుఃఖాల అలల కల్లోలం చేసే సముద్రం అని అనడమే సబబు.



**"భావో నాన్యత్ర గచ్ఛతి"** అనే హనుమానుని నిరవచ్ఛిన్నమైన (ప్రేమ) భక్తి వంటిది ఇక్కడి కవి ప్రేమ.

**శ్లో॥వాచా నిర్మలయా సుధామధురయా యాం నాథ శిక్షా మదాః**
**తాం స్వప్నేఽ పి న సంస్మరామ్యహమహంభావావృతో నిస్త్రపః॥**
**ఇత్యాగః శతశాలినం పునరపి స్వీయేషు మాం బిభ్రతః**
**త్వత్తో నాస్తి దయానిధిర్యదుపతే! మత్తో న మత్తః పరః॥ 56**

**ప్రతిపదార్థము :** నాథ=స్వామీ!, సుధామధురయా=అమృతంకంటే తీయనిదై, అమృతంవలె తీయనిదై, నిర్మలయా=దోషంలేని, వాచా=వాక్కు అనే, (వాక్కుతో), యాం శిక్షామ్=ఏ ఉపదేశాన్ని, (అభ్యాసాన్ని విద్యను), అదాః=(నాకు) ఇచ్చావో, తామ్=దానిని, అహంభావావృతః=అహంకార తిమిరంతో ఆవరింపబడి, నిస్త్రపః=సిగ్గులేనివాడనైన, అహమ్=నేను, స్వప్నే అపి=స్వప్నంలోను, న సంస్మరామి=స్మరించడం లేదు, ఇతి=అని, ఆగః శతశాలినమ్=వందలకొలది అపరాధాలను కల, మామ్=నన్ను, పునరపి=తిరిగి, స్వీయేషు=నీకు చెందినవారి గోష్ఠిలో, బిభ్రతః=భరించే, త్వత్తః పరః=నీకంటెగొప్ప, యదుపతే=యదునాథా!, దయానిధిః=దయాసముద్రుడు, నాస్తి=లేడు, మత్తః=నాకంటే, పరః=గొప్ప, మత్తః=పిచ్చిపట్టినవాడు, న=లేడు.

**భావము :** ధ్యాన శ్లోకాలు పూర్తి అయినవి. స్తోత్రం కూడా ముగియబోతున్నది. ఈ స్తోత్రంలోని శబ్దార్థాలు రెండూ అమృతంవలె మధురాలు. నాకే తీయగా ఉన్నవి. దోషాలు లేనివే. నిర్మలమే. అయితే ఈ మధురవాగర్థాలను అనుగ్రహించినవాడు మధురాధిపతి. "ఇతడు మధురమధురుడు" అని చివరిదైన 60వ శ్లోకంలో చెప్పబడుతున్నది. ఈ మధురవాక్కును నాకు నేర్పించినది గీతను పాడిన నీవే. స్తోత్ర రత్నంలో చివరి 59వ శ్లోకంలో **"త్వమేవైవంభూతం ధరణిధర! మే శిక్షయ మనః"**–నా మనస్సును నీవే శిక్షించి, ఉపదేశించి, సంస్కరించి, జ్ఞానాన్ని కల్గించాలి" అని యామునులు ప్రార్థించారు. ఇక్కడ కవి తన వాక్కును శిక్షించి, సంస్కరించడాన్ని గూర్చి పల్కుతున్నాడు. గోపాలుడు వాక్కులకు పాలకుడు. వాక్కులను రక్షించి, దోషాలు లేకుండా కాపాడేవాడు. **"మధురాధిపతే రఖిలం మధురమ్"** అని వల్లభాచార్యులు శ్రీకృష్ణుని సర్వతోమాధుర్యంలో అభినివేశాన్ని పొందారు. **"యదుపతే", "మధురాధిపతే"–అభేదే తృతీయా,** ఆ ప్రయోగంలో స్వారస్యం ఉన్నది. నీవు నాకు వాక్కులో శిక్షను కల్గించేటపుడు నీ వాక్కులలోని మాధుర్యం ఏమని చెప్పను! నీ మధురవాక్కులతో నాకు మధురవాక్కుయొక్క అభ్యాసాన్ని కల్గించావు-అని భావం. **"నిస్త్రపః"**–స్తోత్రరత్నంలో "నిస్త్రపుడైన కవికి" **("కవయే నిరపత్రపాయ")** అని తమను యామునులు నిందించుకొన్నారు. చివరలో కూడా "నిర్దయం మామలజ్జమ్" అని తమను నిందించుకొన్నారు. అదే రీతిలో ఇపుడు కూడా మొదట్లో వలెనే చివరలోను **"నిస్త్రపః"** అని కవి అన్నాడు. ఏ విధంగా సిగ్గులేక పోవడం? సిగ్గుకు ఏమి కారణం?

రూపం తన మనస్సును ఆకర్షించి, అక్కడి నుండి వీడిపోకుండా ధ్యాన విషయంగా ఉండాలని అన్నాడు. ఇక్కడ నా మనస్సును ఆకర్షించడంతోపాటు నా కన్నులను కూడా సనాథంగా, సఫలంగా చేసి, మునివాహనసూరి **"ఎన్ అముదినై కణ్డ కణ్ గళ్ మత్తొన్నినై క్కాణావే"** (నా అమృతస్వరూపిని దర్శించిన కన్నులు వేరొకదానిని దేనిని దర్శించవు) అనే రీతిలో కన్నుల ముందు సదా దర్శనమివ్వాలని అంటున్నాడు. **"విభుః"** అనే దానికి అంతటా నా కంటిముందు సర్వకాలం నిండి ఉండాలని భావం. వేదాలచేత నిరంతరం నమస్కరింపబడేవాడు నా మనస్సును సర్వకాలం సనాథంగా చేయడంతో చాలదు. నా నేత్రాలను సనాథంగా చేయాలి. శ్రీకృష్ణుని సదా దర్శిస్తూ ఉండలేని కన్నులు అనాథ, భాగ్యహీన. శ్రీకృష్ణుని దర్శించడమే కన్నులు ఉన్న దానికి ఫలం. **"నిరంతరమ్"** అని అన్న వెంటనే **"నిరయే నిపతంతమ్"**– అని అనడంలోని స్వారస్యం గమనించదగినది. ధ్యానంలో అంతరం–విచ్ఛేదం రావడమే జ్ఞానికి భయం అన్నది తైత్తిరీయోపనిషత్తు. "నీతో కలసి ఉండడమే మోక్షం–నిన్ను విడిచి ఉండడమే నరకం **"యస్త్వయా సహ స స్వర్గో నిరయో యస్త్వయా వినా"** –అని శ్రీరామునితో అన్నది సీతాదేవి. నీ ధ్యానంలో విచ్ఛేదం కల్గడమే నరకం–అనే అర్థాన్ని నిరయశబ్దంతో కవి స్ఫుటీకరిస్తున్నాడు.

**శ్లో॥ ప్రణిపత్య హరే! భవంతమద్ధా**
**వినిబద్ధాంజలిమేకమేవ యాచే।**
**జనురస్తు కులే కృషీవలానా–**
**మపి గోవిందపదారవిందభావః॥ 55**

**ప్రతిపదార్థము :** హరే=ఆర్తిని హరించేవాడా!, భవంతమ్=నిన్ను, ప్రణిపత్య=సాష్టాంగ నమస్కారం చేసి, వినిబద్ధాంజలిః=జోడించిన చేతులను కలవాడనై, అద్ధా=నిజంగా, ఏకమ్ ఏవ=ఒక్కటిని మాత్రమే, యాచే=యాచిస్తున్నాను, కృషీవలానామ్=కర్షకుల, కులే=కులంలో, అపి=కూడా, జనుః అస్తు=జన్మ కల్గనీ, గోవిందపదారవిందభావః అస్తు=గోవిందుని తామరల వంటి పాదాలలో భక్తి మాత్రం ఉండాలి.

**భావము :** స్వామీ! "ఇపుడు నీకు మోక్షం ఇవ్వను, ఇంకా నీకు జన్మలనే కల్గిస్తాను" – అని నీవు అన్నట్లయితే, కర్షకుల కులంలో పుట్టినా అది నాకు ఇష్టమే. కాని, గోవిందుని శ్రీపాదపద్మాలలో మాత్రం భక్తి కల్గి ఉండాలి–అని కవి భావన. **"అపి గోవింద పదారవిందభావః"**– అని అన్నపుడు "గోవిందుని పాదపద్మంలో భక్తిని కల్గి ఉంటే" అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. **"బృందావనే కిమపి గుల్మలతౌషధీనామ్"** అని ఉద్ధవుడు ఆశపడ్డాడు. **"ఎమ్బెరుమాన్ పొన్‌మలైమేల్ ఏదేను మావేనే"** (భగవానుని బంగారు కొండపై ఏమయినా కాగలను) అని కులశేఖరసూరి ఆశ. **"ముకుంద! మూర్ధ్నా ప్రణిపత్య యాచే భవంతమేకాంతమియంతమర్థమ్, అవిస్మృతిస్త్వచ్చరణారవిందే భవే భవే మేఽస్తు భవత్ప్రసాదాత్"** (4) అనే ముకుందమాల శ్లోకానుభవంవంటిదే ఈ శ్లోకానుభవం.



**"విభో"**– నీవు అంతటా వ్యాపించి ఉండే ప్రభువువు. నిన్ను శరణు పొందడం కోసం ఒక అంగుళంకూడా కదిలి రావలసిన అక్కఱ లేదు. ఉన్న చోటనే ఉంటూ శరణు పొందవచ్చు. నీ శ్రీపాదం సైతం అంతటా వ్యాపించేది. త్రివిక్రముని పాదం ఎక్కడ ఉన్నది? స్తోత్రరత్నంలోని **"విలాసవిక్రాంతపరావలయం త్రివిక్రమ! త్వచ్చరణాంబుజద్వయమ్"** అనే ప్రయోగాన్ని, **"లోకవిక్రాంతచరణౌ శరణం తేఽవ్రజం విభో"** అనే శరణాగతి గద్యప్రయోగాన్ని ఇక్కడ స్మరించాలి. **"భవతే"** అనే చతుర్థీవిభక్తి ప్రయోగం గమనించతగినది. **"వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం"** అనే అనుత్తమ భక్తి అయిన శరణాగతిని నివేదనపదంతో కవి ప్రస్తావిస్తున్నాడు. **"అధునా"** –ఇపుడు, **"క్షిప్రం"** అని విభీషణుడు చూపిన త్వర దీనివల్ల ప్రకటితం.

**శ్లో॥ భవానలజ్వాలవిలుప్తచేతనః**
**శరణ్య!తేఽంఘ్రిం శరణం భయాదయామ్।**
**విభావ్య భూయోఽపి దయాసుధాంబుధే!**
**విధేహి మే నాథ! యథా యథేచ్ఛసి॥ 2**

**ప్రతిపదార్థము :** శరణ్య=ఓ శరణ్యా!, భవ+అనలజ్వాలవిలుప్తచేతనః=సంసారాగ్ని జ్వాలలచే పూర్తిగా లోపించిన జ్ఞానాన్ని కల నేను, తే=నీయొక్క, అంఘ్రిమ్=పాదాన్ని, భయాత్=భయంతో, (అభయాన్ని పొందడాన్నిగూర్చి), శరణమ్=దిక్కుగా, అయామ్=పొందాను, దయాసుధాంబుధే=కృపకు అమృతసముద్రంవంటివాడా! నాథ=నాథా! భూయః అపి=మళ్ళీ తిరిగి, విభావ్య=బాగా ఆలోచించి, యథా యథా ఇచ్ఛసి=ఏయే రీతులలో కోరుతున్నావో, ఆ విధంగా, మే విధేహి=నన్ను నియమించాలి.

**భావము : "సంసారాగ్నివిదీపనవ్యపగతప్రాణ"** అని అంటూ శ్రీరామానుజులు శ్రీభాష్య ప్రారంభంలో పల్కిన రీతిలో ప్రకృతశ్లోకంలోని సూక్తి సాగింది. గీతలో ఆత్మస్వరూపం **"అదాహ్యమ్"** –దహింప వీలుకానిదని చెప్పబడింది. ఇక్కడ **"భవానలజ్వాలవిలుప్త చేతనః"** అని అనబడిందికదా! అని అంటే, ఇక్కడ చెప్పబడ్డ లోపం స్వరూపానికి చెందినది కాదు. జ్ఞానమనే చైతన్యంయొక్క లోపమే. సంసారాగ్ని భౌతికాగ్నికంటే క్రూరమైనది. భౌతికాగ్ని స్వరూపాన్ని–అంటే–కంటికి కన్పించే రూపాన్ని మాత్రమే దహించగలదు. కాని, సంసారాగ్ని జ్ఞానాన్ని కూడా లోపింపజేయగలదు. గీతాచరమశ్లోకం **"మా శుచః"** అని శోక నివారణను తెల్పుతున్నది. భయనివారణాన్ని **"అభయం సర్వభూతేభ్యః"** అని శ్రీరామ చరమశ్లోకం తెలుపుతున్నది. శరణు పొందడం ఏ ఫలాన్ని ఆశించి? అని అంటే, స్వామీ! నీకు ఏయే సేవలు ఏయే విధంగా ఇష్టమో వాటిని అన్నిటినీ ఆ రీతుల్లో చేసేటట్లు నన్ను ఆజ్ఞాపించు– అని కవి భావన. ఇదే నేను కోరే ఫలం– అని భావం. లేక, ఏయే రీతిలో నీకు ఇష్టమో ఆయా రీతుల్లో నీవు నా విషయంలో చేయవచ్చు. నీ విషయంలో నేను ఏమి చేయగల్గినా, అది నాకు మహాభాగ్యం. ఏది నీకు ఇష్టమో, అదే నాకు కూడా ఇష్టం–అని కూడా చెప్పవచ్చు.

**శ్లో॥ విహాయ సంసారమహామరుస్థలీ-**
**మలీకదేహాదిమిలన్మరీచికామ్।**
**మనోమృగో మే కరుణామృతాంబుధే!**
**(కృపాతరంగాకులమన్మనో మృగో)**
**విగాఢుమీశ! త్వయి గాఢమీహతే॥ 3**

**ప్రతిపదార్థము :** కరుణామృతాంబుధే=ఓ కరుణ అనే అమృతానికి సముద్రమా!, అలీకదేహాదిమిలన్మరీచికామ్=అసత్యమైన దేహం మొదలైన వాటితో కూడిన ఎండ మావులను, సంసారమహామరుస్థలీమ్=సంసారం అనే గొప్పలు దారిని, విహాయ= విడిచి, మే=నా, మనోమృగః=మనస్సు అనే లేడి, త్వయి=అమృతాబ్ధివి అయిన నీలో, గాఢమ్= గాఢంగా, విగాఢుమ్=ప్రవేశించి స్నానం చేయాలని, ఈహతే=కోరుతున్నది.

**భావము :** సంసారమరుకాంతారంలో పరిశ్రాంతుడైన దేహికి నీ భక్తి అనే అమృతనదిలో అవగాహనం ఉపదేశింపబడిందని శ్రీదేశికులు యాదవాభ్యుదయంలో అంటారు. దేహాదులన్నీ సంసారమనే ఎడారిలో మిథ్యలు. **"భ్రాంతస్య మే విషయభోగమరీచికాసు"** అని ఇంద్రియభోగాలు ఎండమావులతో పోలుస్తారు. ఇంద్రియాలు లేళ్ళు. ఎడారి ప్రాంతాల్లో నీటిప్రవాహాలు ఉన్నట్లు భ్రాంతి కల్గడంచేత, అక్కడి నీటిని తాగాలనే ఆశతో ఎండలో పరుగెత్తి మోసపోయే మృగాలవలెనే, ఇంద్రియాలు తాపాన్ని కల్గించే విషయభోగాలను తాపం తీర్చే చల్లని నీరు అని భ్రమించి, వాటితో ఆర్తిని తీర్చుకోవాలని ప్రయత్నించి మోసపోతున్నాయి. నీవు సుఖభూమి, సుఖభూమా. సంసారం దుఃఖభూమి, దుఃఖభూమా. సంసారం నరకాకరం. నీవు ఆనంద ప్రవాహం. **"నిత్యాసన్న మశేషతాపశమనం నిఃశ్రేయసార్థప్రదం గ్రీష్మే శీతమివ హ్రదం బహుగుణం బ్రహ్మ ప్రవిష్టో మునిః"** అని సంకల్పసూర్యోదయంలో, బ్రహ్మమనే చల్లని మడుగులో మునిగి, సకల తాపాలను తీర్చుకోవడాన్ని గూర్చి, వేదాంతదేశికులు తెలిపారు. **"ఏష బ్రహ్మ ప్రవిష్టోఽస్మి గ్రీష్మే శీతమివ హ్రదమ్, శామ్యామి పరినిర్వామి"** అని అంటూ మహర్షి పరబ్రహ్మాలో నిమగ్నం కావడాన్ని గూర్చి కీర్తించారు. మనస్సు అనే గజం దావాగ్ని నుండి పరుగెత్తి, పరబ్రహ్మమనే చల్లని నీటిలో మునిగి స్నానం చేసి, ఆనందించడాన్ని గూర్చి భాగవతం కీర్తించింది. **"గాఢమ్"** అనే పదాన్ని ముందువెనుకలలో అన్వయించాలి.

**శ్లో॥ త్వదంఘ్రిఫుల్లాంబుజమధ్యనిర్గల-**
**న్మరందనిఃస్యందనితాంతలంపటః।**
**మనోమిలిందో మమ ముక్తచాపలః**
**త్వదన్యమీశం న తృణాయ మన్యతే॥**
**(త్వదన్యమీశాన! తృణాయ మన్యతే) 4**



కంసుడు దర్శించాడు" – అని శుకుడు కంసుని స్థితిని వర్ణించాడు. "ద్వేషంతో విడువకుండా తనను స్మరించే ఘంటాకర్ణుడు, శిశుపాలురకు కూడా మోక్షాన్ని ఇచ్చిన ఆ విష్ణువుకు నమస్కారం" అని మధుసూదనసరస్వతి అన్నారు– అద్వైతసిద్ధి చివరలో. **"యత్ర నాన్యత్ పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా"** అని భూమవిద్యలో చూపిన ఐకాంతిక నిత్యనిరతిశయసుఖానుభవం అయిన తిరుమేని అనుభవాన్ని కవి ప్రార్థిస్తున్నాడు. నీ మేని నా హృదయాన్ని అధిష్ఠించి వీడిపోకుండా ఉండాలి. అద్భుతంగా నా మనస్సులో సాక్షాత్కారాన్ని ఇవ్వాలి. నిద్రలోను నిజంగా నా మనస్సు ధ్యానించాలి. నిద్ర కూడా సాలంబన సమాధిగా ఉండాలి. స్తోత్రరత్నంలో యామునులు **"భక్తజనైకజీవితమ్"** అని ధ్యానశ్లోకం చివరలో పల్కి, తరువాత 46వ శ్లోకంలో **"ఐకాంతికనిత్యకింకరః ప్రహర్షయిష్యామి సనాథజీవితః"** అని పలు రీతుల్లో ప్రార్థించినట్లే ఇక్కడ కూడా ఈ శ్లోకంలో తిరుమేనియొక్క నిరంతరమైన సేవను ప్రార్థించి, తరువాతి శ్లోకంలో కూడా "నిరంతరంగా తొలగిపోకుండా నీలమేఘవర్ణుడు గోపాలుడు నన్ను కన్నులతో సనాథునిగా చేయాలి" అని కవి ప్రార్థిస్తున్నాడు. స్తోత్రరత్నం 46వ శ్లోకంలో వివరించి, అక్కడ వలె ఇక్కడ కూడా తరువాతి శ్లోకంలో **"సనాథ"** శబ్దాన్ని ప్రయోగించి, **"నయనేనాపి సనాథయే ద్విభుః"** అని అన్నాడు. స్తోత్రరత్నంలోని రీతినే కవి నిరంతరంగా అనుసరిస్తున్నాడన్నది స్పష్టం. అక్కడ 46వ శ్లోకంలోని **"నిరంతర"** శబ్దాన్నే ఇక్కడ కూడా 54వ శ్లోకంలో ప్రయోగించాడు.

**శ్లో॥ నవనీరదనీలిమద్యుతి-**
**ర్నమనీయో నిగమైర్నిరంతరమ్।**
**నిరయే నిపతంతమాశు మాం**
**నయనేనాపి సనాథయేద్విభుః॥ 54**

**ప్రతిపదార్థము :** నవనీరద=నీటిని గ్రహించిన మేఘం వలె, నీలిమద్యుతిః=నల్లని కాంతిని కల్గినవాడు, నిగమైః=వేదాలచే, నిరంతరమ్=ఎడతెగకుండా, నమనీయః=నమస్కరింపబడే గొప్పతనాన్ని కలవాడు అయిన, విభుః=సర్వస్వామి అయిన ప్రభువు, నిరయే=నరకంలో, నిపతంతమ్=పడే, మామ్=నన్ను, నయనేనాపి=కంటితో కూడా, సనాథయేత్=నాథుణ్ణి కలవానినిగా చేయాలి, ఆశు=తత్క్షణమే.

**భావము :** ఆనందమయవిద్యలో–అల్పమైనా భగవద్ధ్యానానికి అంతరాయాన్ని చేస్తే భయాన్ని కల్గినవాడవుతాడు, నిరంతరధ్యానస్థితిలో అభయాన్ని పొందుతాడు–అని తిత్తిరిపక్షులు పలికాయి (తైత్తిరీయోపనిషత్తులో) రసస్వరూపుడైన ఆనందమయ కృష్ణుని నిరంతరం ధ్యానాన్ని చేయగల్గి, ఆనందరస లాభంచేత **"ఆనందీ"**గా కావాలని కవి ఆశ. 58వ శ్లోకంలో **"కృష్ణ"** అనే నామాక్షరాలు (వర్ణాలు) రెండే నిరతిశయ సుఖాన్ని ఇచ్చే రసాయనమని కవి అనబోతాడు. ఇక్కడ ముందు శ్లోకంలో "శ్రీకృష్ణుని అద్భుతమైన

**నఖచంద్రమయూఖమూర్ఛితా-**
**ఖిలతాపం పదయోర్యుగం దధత్॥ 52**

**ప్రతిపదార్థము :** విధి=బ్రహ్మ, శర్వ=ఈశ్వరుడు, ముఖ=మొదలైన, అమర=దేవతల, స్ఫురన్మకుట=జ్వలించే కిరీటాలలోని, ఉన్నిద్రమణిప్రభా=వికసించే రత్నకాంతులచేత, ఆకులమ్=నిండినది, నఖ=శ్రీపాదాల వేళ్ళ గోళ్ళు అనే, చంద్ర=చంద్రుని, మయూఖ=కిరణాలచే, మూర్ఛిత=పోగొట్టబడిన, పదయోర్యుగమ్=పాదద్వయాన్ని, అఖిలతాపమ్=సకలతాపాలను కల్గినది (అన్ని తాపాలను పోగొట్టేది) అయిన (వపుః)

**భావము :** ధ్యానాన్ని ఆరంభించినపుడు శర్వపితామహాదులకు "భజనీయుడు" అని స్తుతించినట్లు, ధ్యానం చివరలోకూడా **'విధిశర్వముఖామర'** అని కవి అంటున్నాడు. స్తోత్రరత్నం ప్రారంభంలో **'అపి శర్వపితామహాద్యైః'**(7)అని, చివరలో**'విధిశివసనకాద్యైః'** (47) అని పాడిన తీరును కవి అనుసరించిన విషయం స్పష్టం. ప్రకాశించే శ్రీపాదాన్ని గూర్చి **"నఖచంద్రికయా నిరస్తతాపే"** అనే శుకుని అనుభవాన్ని తలచి, కవి **"నఖచంద్రమయూఖమూర్ఛితాఖిలతాపమ్"** అని అన్నాడు. స్తోత్రరత్నంలోని 29వ శ్లోకంలో **"ఉదీర్ణసంసారదవాశుశుక్షణిం క్షణేన నిర్వాప్య"** అని పల్కిన శ్రీపాదంయొక్క సమస్త తాపహరం అయిన స్వభావాన్ని కవి స్మరిస్తున్నాడు. తాపాన్ని మూర్ఛిల్లేటట్లు, ఊపిరి పీల్చనీయకుండా చేయడం అంటే తీర్చడమే. తాపం మనలను మూర్ఛిల్లేటట్లు చేయడాన్ని పోగొట్టి, తాపాన్నే మూర్ఛిల్లేటట్లు చేసినదని స్వారస్యం.

**శ్లో॥ సరతస్సరణౌ సతో బహిః**
**స్వపతో వాలపతో గృహాంతరే।**
**వపురీదృశమీశ! తావకం**
**హృదయాలంబనమస్తు మే సదా॥ 53**

**ప్రతిపదార్థము :** సరణౌ=దారిలో, సరతః=నడిచివస్తున్నా, బహిః సతః=బయట ఉన్నా, గృహాంతరే=ఇంటిలోపల, స్వపతః=నిద్రపోతున్నా, ఆలపతో వా=మాటలాడుతూ ఉన్నా, ఈశ=నా ప్రభూ!, తావకమ్=నీయొక్క, ఈదృశమ్=ఇటువంటి నాచే వర్ణింపబడ్డ, వపుః =రూపం, సదా=ఎల్లప్పుడు, మే=నాయొక్క, హృదయాలంబనమ్=మనస్సుకు ధ్యాన విషయంగా, అస్తు=ఉండాలి.

**భావము :** తిరుమేని వర్ణనను 15 శ్లోకాలతో చేసి, ధ్యానాన్ని ఉపసంహరిస్తున్నాడు కవి. సౌందర్య సముద్రం అయిన నీ ఇటువంటి మేని సర్వదా నా మనస్సుకు ఆనందవిషయంగా తొలగిపోకుండా ఉండాలి. నా మనస్సులో గూడుకట్టుకొని నిత్యగానం చేస్తూ, అన్ని కాలాలలో దర్శనమివ్వాలి-అని అంటున్నాడు. "కూర్చుని ఉన్నా, నడుస్తున్నా, నిలచి ఉన్నా, శయనించి ఉన్నా, వదలకుండా హృషీకేశుని తలుస్తూ జగత్తును తన్మయంగా



**ప్రతిపదార్థము :** త్వదంఘ్రి=నీ శ్రీపాదం అనే, ఫుల్ల+అంబుజ=వికసించిన తామరయొక్క మధ్య=నడుమనుండి, నిర్గలత్=వెలువెడలు (స్రవించే), మరందనిఃస్యంద=మధు ప్రవాహంలో, నితాంత=మిక్కిలి, లంపటః=ఆనందరసాన్ని, (ఆశను) కల్గినది, ముక్తచాపలః =(నిన్ను తప్ప మిగిలిన వాని విషయంలో) విడచిన ఆశను కల్గినది అయిన, మమ=నాయొక్క, మనోమిళిందః=మనస్సు అనే తేనెటీగ, త్వదన్యమ్=నీకంటే అన్యుడైన, ఈశమ్=ప్రభువును, తృణాయ=ఒక గడ్డిపోచగా కూడా, న మన్యతే=తలవడం లేదు (పాఠాంతరంలో), ఈశాన=ప్రభూ!, త్వదన్యమ్=నిన్ను తప్ప మిగిలిన వానిని, తృణాయ= గడ్డిపోచగా, మన్యతే=తలుస్తున్నది.

**భావము :** కువలయానందంలో ఉదహరింపబడ్డ **"తవామృతస్యందిని పాదపంకజే నివేశితాత్మా కథమన్యదిచ్ఛతి, స్థితేఽరవిందే మకరందనిర్భరే మధువ్రతో నేక్షురకం హి వీక్షతే"** (27) అనే స్తోత్రరత్నశ్లోకాన్ని చూచి అభినివిష్టుడైన జగన్నాథకవి ఈ శ్లోకానికి ప్రతిబింబంగా ప్రకృతశ్లోకాన్ని రచించాడన్నది సుస్పష్టం. "నీ భోగ్యతలో మునిగిన మనస్సు వేఱు దేనిలోనికి పోలేదు- అని కవి అంటున్నారు అని స్తోత్రరత్నశ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ వ్యాఖ్యాత కృష్ణసూరి అన్నారు. స్తోత్రరత్నశ్లోకంవలెనే ఈ శ్లోకంకూడా యుష్మచ్ఛబ్దంతోనే ఆరంభమవుతున్నది. ప్రకృతంలో రూపకాలంకారం. **"ఫుల్లాంబుజ"** -వికసించిన పాదపద్మం నన్ను స్వీకరించాలనే ఆశతో విచ్చుకొన్నదా!-అని హార్దభావం. స్తోత్రరత్నశ్లోకంలోని **"స్థితే (సతి)"** అనే పాఠానికి- "మధువుచేత పూర్ణం అయిన ఎఱ్ఱ తామర భోక్తలను ఉద్దేశించి తగిన సమయం కోసం ఎదురు చూస్తు ఉండగా" అని వ్యాఖ్యానం చేయబడింది. **"ఫుల్లాంబుజ"** అనే ప్రయోగంలో వ్యక్తమయే భావంకూడా ఇదే కదా. కువలయానందంలో, రసగంగాధరంలోను స్తోత్రరత్నశ్లోకంలోని ఉత్తరభాగంలో గల **"న వీక్షతే"** అనే ప్రయోగానికి "ఆశతో చూడడం లేదు" అనే అర్థాన్ని తెలిపి, ఇచ్ఛను నిషేధించినట్లు వివరింపబడింది. ఇక్కడకూడా ఆ రీతిలోనే ఇచ్ఛతో కూడిన ఆదరాన్ని నిషేధిస్తున్నాడు కవి.

**శ్లో॥ జగత్త్రయత్రాణవిధౌ ధృతవ్రతం (ధురంధరం)**
**తవాంఘ్రిరాజీవమపాస్య యే జనాః।**
**శరణ్యమన్యం మృగయంతి యాంతి తే**
**నితాంతమీశాన! కృతాంతదేహళీమ్॥ 5**

**ప్రతిపదార్థము :** ఈశాన=ప్రభూ!, జగత్త్రయత్రాణవిధౌ=ముల్లోకాలను రక్షించే ధర్మంలో, ధృతవ్రతమ్=(అద్వితీయమైన) దీక్షను కల్గి ఉండే, తవ+అంఘ్రిరాజీవమ్=నీ పాదపద్మాన్ని, అపాస్య=ప్రక్కకు తొలగదోసి, యే జనాః=ఏ జనులు, అన్యం శరణ్యమ్= వేఱొక దిక్కును, మృగయంతి=వెదకుతున్నారో, తే=వారు, నితాంత=మిక్కిలిగా, కృతాంతదేహళీమ్ =యముని ద్వారాన్ని, యాంతి=చేరుతున్నారు.

**భావము :** స్తోత్రరత్నంలోని **"నమస్యదార్తి క్షపణే కృతక్షణం ధనం మదీయం తవ పాద పంకజమ్"** (30) అనే ప్రయోగాన్ని ప్రకృతశ్లోకంలోని **"జగత్త్రయత్రాణవిధౌ ధృతవ్రతం తవాంఘ్రిరాజీవమ్"** అనే పదసందర్భం తలపిస్తున్నది. ఆర్తిహరం అయిన నీ పాదాన్ని విడిచి ఆర్తిని కల్గించే వేఱే పాదాలను ఆశ్రయించడమా! ఏమి మూర్ఖత! అని అంటున్నాడు కవి. "ఓ శ్రీనివాసుని దయాదేవీ! నీపట్ల గౌరవం లేకుండా ఎవడు వేఱొక గతిని ఆశ్రయిస్తున్నాడో అతడు తన దాహాన్ని తీర్చుకోవడం కోసం, సురనది అయిన గంగానది దగ్గరలో ప్రవహిస్తున్న విషయాన్ని గమనించకుండా, అరణ్యంలోని ఎండమావులను అన్వేషించేవానివలె ఉన్నాడు" అనే దయాశతకశ్లోకభావం ప్రకృతంలో స్మరణీయం". అటువంటివాడు తిరిగి నా వశంలో చిక్కుకుంటున్నాడు" అని నచికేతునితో యముడన్నాడు కదా! **"మృగయంతి"** -వెదకుతున్నారు; మృగంవలె ఆచరిస్తున్నారు అని రెండర్థాలు. పూర్వశ్లోకంలో ప్రస్తావించిన మృగతృష్ణికను అన్వేషిస్తున్నారు-అనే అర్థం ఇక్కడ ఈ క్రియా ప్రయోగంవల్ల ధ్వనిస్తుంది.

**శ్లో॥ రమాముఖాంభోజవికాసనక్షమో**
**జగత్త్రయోద్బోధవిధానదీక్షితః।**
**కదా మదజ్ఞానవిభావరీం హరే!**
**హరిష్యతి త్వన్నయనారుణోదయః॥ 6**

**ప్రతిపదార్థము :** హరే=ఆపదలను హరించే స్వామీ!, రమాముఖాంభోజవికాసనక్షమః= లక్ష్మీదేవియొక్క ముఖకమలాన్ని ఆనందంతో వికసింపజేయడంలో సామర్థ్యాన్ని కల్గినది, జగత్త్రయ+ఉద్బోధవిధానదీక్షితః=(అనాది మాయచేత నిద్రపోయి అజ్ఞానంలో మునిగివున్న) ముల్లోకాలను నిద్రలేపి,(వారి) జ్ఞానాన్ని వికసింపజేయడమే ఒక గొప్ప యాగదీక్షగా వహించినది అయిన, త్వన్నయన+అరుణ+ఉదయః=నీ నేత్రాల కటాక్షాలు అనే అరుణోదయం, కదా=ఎపుడు, మత్+అజ్ఞానవిభావరీమ్=నా అజ్ఞానం అనే రాత్రిని, హరిష్యతి=పోగొడుతుందో కదా!

**భావము :** ముందుశ్లోకంలో భగవానుని పాదపద్మాలు పట్టిన దీక్షనుగూర్చి పల్కిన కవి ఇందులో నేత్రపద్మాలు స్వీకరించిన దీక్షనుగూర్చి పల్కుతున్నారు. నేత్రాలు, పాదాలు రెండూ పద్మాలే కదా **"కణ్ ఇణైయుమ్ అరవిన్దమ్ అడియుమ్ ..."** (నేత్ర ద్వయి అరవిందం, పాదాలు కూడా అవే) అని దివ్యసూరుల వాక్కు. అనాది మాయావశం చేత నిద్రపోతున్న జనులకు ప్రబోధాన్ని నీ నేత్రాలు కల్గిస్తున్నవి. జ్ఞాననేత్రాన్ని వికసింపజేసి, అజ్ఞాన రాత్రిని పోగొట్టి జ్ఞానసూర్యుని ఉదయింపజేస్తున్నవి. **"తేషామాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్"** అని గీతాసూక్తి. ఇందులో భగవన్నేత్రాలను దీక్షితునితో పోల్చాడు. దీక్ష వహించిన వానికి పత్ని ఉండాలి. సంసారరాత్రిని తీర్చే దీక్షలో పత్ని అయిన రమయొక్క సాహచర్యాన్ని ధ్వన్యర్థ ప్రక్రియలో కవి సూచిస్తున్నాడు. తన సంతానం అయిన జనులను



తెడ్లతో వేగంగా తోసినట్లుగా ఆకాశసముద్రంలో ఎగిరే గరుడుడనే ఓడను పిక్కలనే తెడ్లు తోస్తూ వచ్చాయి. గజేంద్రునకు స్వామి మోక్షాన్ని అనుగ్రహించడంకోసం పరుగెత్తి రావడంలో సహాయపడ్డాయి పిక్కలు. అందువల్లనే **"జంఘాం దృష్ట్వా జననపదవీ జాంఘికత్వం జహాతి"** అని దర్శన మాత్రంతోనే మోక్షాన్ని ఇస్తున్నట్లు భగవద్ధ్యానసోపానం పేర్కొన్నది **"అరిగీర్ణగజేంద్ర"** అన్నది మొత్తం గజేంద్రుని మేనికి పొసగదు- మొసలి మింగినది మోకాలు మాత్రమే. **"గజ ఆకర్షతే తీరే గ్రాహ ఆకర్షతే జలే"** అని మహర్షులు పలికారు. ఈ విధంగా ఆకర్షణసందర్భంలో భగవానుడుకూడా ఒక ఆకర్షణం చేశాడు. ద్విజరాజును ఆకర్షించాడని స్వారస్యం. **"కృతే చ ప్రతికర్తవ్యమ్"** అన్నది సామాన్యధర్మం కదా!

**శ్లో॥ కులిశాంకుశకంబువారిజ(సాంబుజ)-**
**ధ్వజచక్రాద్యభిరామలక్ష్మణా।**
**అరుణారుణకోమలత్విషా**
**కమనీయేన కలేన రాజితమ్॥ 51**

**ప్రతిపదార్థము :** కులిశ=వజ్రం, అంకుశ=మావటి (అంకుశం), కంబు=శంఖం, వారిజ=తామరపూవు, ధ్వజ=పతాకం, చక్ర=చక్రం, ఆది=మొదలైన, అభిరామ=అందమైన, లక్ష్మణా=రేఖల గుర్తులను కల్గినది, అరుణ+అరుణ కోమలత్విషా=అరుణునివలె ఎఱ్ఱని అందమైన శోభతో, కమనీయేన=మనస్సును కొల్లగొట్టే, కలేన=పాదమూలంతో (అరికాళ్ళతో), రాజితమ్=ప్రకాశించేది అయిన, (వపుః)

**భావము :** శ్రీపాదాల వర్ణన ప్రస్తుతం అయినందున, స్తోత్రరత్నంలోని అద్భుతవర్ణనంలో గల **"శంఖరథాంగకల్పకధ్వజారవిందాంకుశవజ్రలాంఛనమ్, త్రివిక్రమ! త్వచ్చరణాంబుజ ద్వయమ్"** (31) అనే శ్లోకం కవి మనస్సులో గోచరమైనది. తత్ఫలమే ప్రకృత శ్లోకంగా రూపొందింది. అక్కడ శ్రీపాదాలనుండి అనుభవం ప్రారంభం కనుక ధ్యానారంభంలోనే ఈ వర్ణన ఉన్నది. ఇక్కడ చివరలో ఉన్నది **"లాంఛనమ్"** అనే పదం. ఇక్కడ **"లక్ష్మ"** అని ప్రయోగింపబడింది. "నా తలకు ఆభరణంగా శంఖచక్రాది చిహ్నాలతో లిఖితమై ఉన్నదానిని" అని స్తోత్రరత్న వ్యాఖ్యాతసూక్తి. మన శిరస్సుల వైశేష్యం లాంఛనం అయిన శ్రీపాదముద్రను ఉంచడాన్ని దృష్టిలో పెట్టుకొని **"లాంఛనమ్"** అని స్తోత్రరత్న ప్రయోగం. **"చరణపంకజేనాంకితమ్"** అని ఈ త్రివిక్రముని పాదం తన ముద్ర పడేటట్లు లోకాలను అనుగ్రహించిన తీరులో దయాశతకం అభినివేశాన్ని పొందింది. పాదముద్రలు శిరోభాగాలపై పడాలని ఆకాంక్ష.

**శ్లో॥ విధిశర్వముఖామరస్ఫుర-**
**న్మకుటోన్నిద్రమణిప్రభాకులమ్।**

పీతాంబరశోభ" అని స్తోత్రరత్న వ్యాఖ్యానసూక్తి. జానువులలోని నూపురరత్నాలకాంతి సమూహాలు జటలు జటలుగా పెనవేసికొని ఉన్నాయి.

**శ్లో॥ అరిగీర్ణగజేంద్రగోపనే**
**దధతా జాంఘికతామలౌకికీమ్।**
**త్రిజగన్మహనీయమూర్తినా**
**వరజంఘాయుగళేన శోభితమ్॥ 50**

**ప్రతిపదార్థము :** అరిగీర్ణగజేంద్రగోపనే=శత్రువైన మొసలిచేత పట్టుకొనబడ్డ గజేంద్రుని రక్షించడంలో, అలౌకికీమ్=లోకాన్ని అతిక్రమించిన, జాంఘికతామ్=మోకాళ్ళ వేగబలాన్ని, దధతా=కల్గినది, త్రిజగత్ మహనీయమూర్తినా=ముల్లోకాలు పూజించతగిన రూపాన్ని కల్గినది అయిన, వరజంఘాయుగళేన=శ్రేష్ఠమైన పిక్కలు రెండిటిచేత, శోభితమ్= అలంకరింపబడినది ఐన (వపుః)–

**భావము : "కాలేపుదూత్యద్రుతదరగతిమ్"** అని భగవద్ధ్యానసోపానంలో భగవానుని జంఘుల వర్ణనం దేశికులచేత చేయబడింది. వేగానికి పిక్కలబలం అవసరం. గజేంద్రుని రక్షించడంకోసం పరుగెత్తి వచ్చిన పరుగులో కూడా మిక్కిలి వేగం ఉన్నదా! లోకాతీతం అయిన ఆ పిక్కల వేగంలో అభినివేశాన్ని పొందినవారున్నారా! ఎందుకోసం అంత త్వర భగవానుని జంఘులకు? అని అంటే, భక్తుని పిక్క మొసలి చేత పట్టుబడింది. మొసలి మింగబోయిన భక్తుని పిక్కను విడిపించడం కోసం భగవానుని పిక్కలు త్వరపడ్డాయి. సజాతీయాభిమానం భగవానునిది. గరుడుడేకదా వాహనంగా వేగంతో భగవానుని మోసికొనివచ్చాడు! అనే ఆక్షేపం ఇక్కడ కలుగవచ్చు. **"ఉక్షా దక్షాంతకస్య"** అని గరుడపంచాశత్ శ్లోకంలో అది వర్ణింపబడినది. **"అకర్షన్ ద్విజరాజమపి"** అనే రీతిలో పక్షిరాజునుకూడా భగవానుడు తన పిక్కలతో తన్నుతూ వచ్చాడు. గరుడునికూడా తాను ఈడ్చుకొంటూ ఎందుకోసం అంత వేగంగా రావడం? పిక్కలు చాలవా? తాను మాత్రమే పరుగెత్తి రాకూడదా! "గరుడారూఢుడై దిక్కులలోని భక్తులకు సేవను అనుగ్రహిస్తూ వారి ఆశను పూర్తి చేయడం కోసం గరుడవాహనుడై దిక్కులన్నిటిలో పరుగెత్తి వచ్చి, దర్శనం ఇచ్చి, వారి ఆశను పూర్ణం చేయడం కోసం. ఈ అవసరంలో తాను వాహనమై ఉండి, తన వేగబలాన్ని అంతటినీ చూపి, తాను సేవచేయాలని ఆశపడే గరుడుని ఆశను పూర్తి చేయడం కోసం. గజేంద్రునకు కూడా, అతని (గజేంద్రుని) శ్రీపాదాలను వదలకుండా ఉడుము పట్టుపట్టినట్లుగా పట్టుకొని, అతడు ఎంతగా విదలించినా వదలకుండా గట్టిగా పట్టిన మొసలిరూపుడైన గంధర్వునకు దర్శనాన్ని అనుగ్రహించడంకోసం. ఈ విధంగా పలువిధ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని గరుడారూఢుడై పరుగెత్తి వచ్చినట్లున్నాడు. గరుడుని వేగానికికూడా తృప్తి లేకుండా, స్వామి పిక్కలులో గరుడునిపై పలు మార్లు తన్నుతూ, తన శక్తిని కూడా అతనికి కలిపి, అతని వేగాన్ని పెంచుతూ వచ్చాయి. ఓడను



రక్షించడం–తల్లి అయిన లక్ష్మియొక్క ముఖకమలాన్ని రంజింపచేస్తున్నది–అని అనడంద్వారా ఈ పత్నీసాన్నిధ్యాన్ని సూచించాడు. భగవత్కటాక్షం ఒక అరుణోదయం. ఆ అరుణోదయంలో లక్ష్మి ముఖ కమలం వికసిస్తున్నది. నా అజ్ఞాన విభావరి తీరుతున్నది. **"తదా కదా"** అనే పదం ద్వారా తన త్వరను కవి సూచిస్తున్నాడు. **"హరే హరిష్యతి"** అనే పదాల చేరికలోని అందం గమనించతగినది. హరించేవాడే కదా హరి.

**శ్లో॥ (సురాసురస్వాన్త చకోరచుమ్బితా)**
**మునీంద్రచిత్తైకచకోరజీవికా**
**సమస్తసంతాపచయాపనోదినీ।**
**మహానిశీథే మమ మానసే కదా**
**స్ఫురిష్యతి త్వన్ముఖచంద్రచంద్రికా॥ 7**

**ప్రతిపదార్థము :** మహానిశీథే=గొప్పరాత్రి అయిన, మమ మానసే=నా మనోగుహలో, మునీంద్రచిత్తైకచకోరజీవికా=మునిశ్రేష్ఠుల మనస్సు అనే చకోరపక్షులను జీవింపచేసే ఒకే ఆహారం, సమస్తసంతాపచయ+అపనోదినీ=సకలసంతాపాలను పోగొట్టేది అయిన, త్వత్ముఖచంద్రచంద్రికా=నీ ముఖం అనే చంద్రుని చంద్రప్రభ, కదా=ఎపుడో కదా, స్ఫురిష్యతి=ప్రకాశింపబోతున్నది.

**భావము :** గతశ్లోకంలో అజ్ఞానతిమిరాన్ని పోగొట్టేది ఎపుడో కదా! అని అన్నాడు. ఆ అజ్ఞానం హృదయకుహరంలో ఉన్నది పూర్వం అజ్ఞాన విభావరి అని అన్నాడు. ఇక్కడ మహారాత్రి–మహానిశీథి–అని అంటున్నాడు. నీ ముఖచంద్రుడు నా హృదయంలో ప్రకాశించి చీకటిని పోగొట్టి, ఆహ్లాదాన్ని కల్గించాలి అని అంటున్నాడు. చకోరపక్షులు వెన్నెలనే ఆహారంగా గ్రహించి, జీవిస్తాయని కవి సమయం. ఈ చంద్రికను మునీంద్రుల చిత్తం చకోరపక్షివలె తాగి జీవిస్తుందని అంటున్నాడు. స్తోత్రరత్నంలోని **"భక్తజనైకజీవితమ్"** అనే ప్రయోగాన్ని ప్రకృతంలో స్మరించాలి. ఈ చంద్రిక కవికి తాగే జలం. ఈ చంద్రిక సమస్త తాపాన్ని పోగొట్టేది. సామాన్యచంద్రునివలె స్వల్పమైన, బాహ్యతాపాన్ని మాత్రమే పోగొట్టేది కాదు. మునుల మనస్సులు చకోరపక్షులవలె నీ ముఖచంద్రచంద్రికను తాగి జీవిస్తున్నవి అని కవి ఇక్కడ ఆరంభంలోనే పలికాడు. చివరలో 59శ్లోకంలో కూడా "ముకుందముఖచంద్రునివద్ద నా మనస్సు చిరకాలం చకోరపక్షివలె ఆనందించాలి" అని కవి వాక్కు. అక్కడ **"అమందమిళదిందరే"** అని రమా ముఖకమలంయొక్క యోగాన్ని గూర్చి పలికాడు. **"నఖచంద్రచంద్రికా"** అని ప్రకృతంలో పాఠాంతరం. అది **"నఖమణిచంద్రికయా నిరస్తతాపే"** అనే శుకుని ఉక్తితో పోలి ఉన్నది.

**శ్లో॥ సుయౌవనాపాండురగండమండల–**
**ప్రతిస్ఫురత్కుండలతాండవాద్భుతమ్।**

**గదాగ్రజ! త్వన్ముఖఫుల్లపంకజం**
**కదా మదక్ష్ణోరతిథీభవిష్యతి॥ 8**

**ప్రతిపదార్థము :** గదాగ్రజ=కృష్ణా! సుయౌవన+ఆపాండురగండమండల–ప్రతిస్ఫురత్ కుండలతాండవ+అద్భుతమ్=చక్కని యౌవనంచేత మంచి తెల్లని వర్ణాన్ని కల చెక్కిళ్ళు అనే మండలంలో ప్రతిఫలించే కర్ణకుండలాల, అద్భుతం అయిన తాండవాలచేత శోభించే, త్వత్ ముఖఫుల్లపంకజమ్=నీ ముఖం అనే వికసించిన తామర, కదా=ఎప్పుడు, మదక్ష్ణోః =నా కన్నులకు, అతిథీభవిష్యతి=అతిథి కాగలదో కదా!

**భావము :** స్తోత్రరత్నంలోని **"తవ పాదపంకజం కదా ను సాక్షాత్కరవాణి చక్షుషా"** అనే శ్లోకంనుండి ప్రారంభమయే మూడు శ్లోకాల భావం, **"విలంబికుండల... ముఖశ్రియా న్యక్కృతపూర్ణనిర్మలామృతాంశుబింబాంబురుహోజ్జ్వలశ్రియమ్"** అని, **"కోమలగండమ్"** అని ఇత్యాదిగా గల శ్లోకాల భావాలు మెదిలి ప్రకృతశ్లోకంగా రూపుదిద్దుకున్నాయి. అవి అన్నీ కలిసి ఈ శ్లోకంలో ఒక విచిత్రానుభవంగా పరిణమించాయి. **"సుయౌవన"**–"సు" అనే పదానికి **"అచింత్యదివ్యాద్భుతనిత్యయౌవన"** మని అర్థం. **"ఆపాండురచంద్ర మండలమ్"**–తెల్లని చంద్రమండలంవలె అఖండమండలం–అని మండలశబ్ద ప్రయోగంలోని భావం. ఇది **"నిర్మలామృతాంశుబింబమ్"**– అనే స్తోత్రరత్న ప్రయోగానికి ప్రతిబింబం. చంద్రబింబంతో **"అంబురుహోజ్జ్వలశ్రియమ్"** అని ముఖశ్రీ వర్ణనతో కలయిక. ఇక్కడకూడా **"ముఖఫుల్లపంకజ"** అని తామరశ్రీని కవి చేర్చాడు. చంద్రుడు, తామర– అనే ఇద్దరు సహజవిరోధులు ఆనందంగా చేరే ముఖం. **"చంద్రం గతా పద్మగుణాన్ న భుంక్తే"** ఇత్యాదిగా కాళిదాసు ద్విసంశ్రయం అయిన ప్రీతినిగూర్చి వర్ణించాడు. దానికి మూలం శ్రీరామాయణంలోని **"హేమసమానవర్ణం తస్యాననం పద్మసమానగంధి"** అనే శ్లోకం. **"గదాగ్రజ"** – రుక్మిణీదేవి తన ప్రణయపత్రికలో – **"గదాగ్రజ ఏత్య పాణిం గృహ్ణాతు మే"** అని అంటూ సంబోధించిన నామం ఇది. నీ ముఖ మండల సేవకోసం ఆమె ఆశ పడినట్లే నేను కూడా ఆశపడుతున్నాను– రుక్మిణి కరగ్రహణాన్ని చేసి ఆమెను వక్షఃస్థలంలో పెట్టుకొన్నట్లే, నాకు కూడా నీ చేతిని ఇచ్చి, నన్ను నీ హృదయంలో ధరించాలి– అని హార్దభావం. **"అతిథీభవిష్యతి"**– నీవే స్వయంగా తటాలునవచ్చి, ఆకలితో ఉన్నవానివలె నన్ను ఆదరంతో గ్రహించాలి. **"లోచనాభ్యాం పిబన్నివ"** అని అన్నట్లు నా కన్నులు నీ ముఖ శోభను తాగాలి.

**శ్లో॥ సురాపగాతుంగతరంగచాలితాం**
**సురాసురానీకలలాటలాలితామ్।**
**కదా దధే దేవ! దయామృతోదధే!**
**భవత్పదాంభోరుహధూళిధోరణీమ్॥ 9**



సుందరమ్=అందమైనది, ఉదయన్ మణినూపురప్రభాసరణిశ్రేణి=రత్ననూపురాల కాంతిప్రభల శ్రేణులు, జటాలజానుకమ్=జటలవలె పెనవేసికొని ఉండే జానువులను కల్గినది అయిన (వపుః).

**భావము : "త్రిభువనకమనం తమాలవర్ణం రవికరగౌరవరాంబరం దధానే! వపురలక కులావృతాననాబ్జం విజయ సఖే రతిరస్తు మేఽనవద్యా"** అని భీష్ముడు ఉత్తరాయణ పుణ్యకాలం ప్రభాతంలో శ్రీకృష్ణుని సేవిస్తూ పల్కిన మొట్టమొదటి శ్లోకం. ముల్లోకాల మనస్సును హరించేది, బాలసూర్యుని కిరణాలవంటి పీతాంబరాన్ని ధరించినది, అలకభారాలు పడి విస్తరించి, వాటిచేత మఱుగుపఱచబడుతున్న (ఆవరింపబడుతున్న) తామరపూవువంటి ముఖాన్ని కల్గినది అయిన తిరుమేనిని కల్గిన విజయసఖుని పట్ల నాకు శుద్ధమైన భక్తి కలగాలి" అని ప్రార్థించాడు భీష్ముడు. అక్కడ **"వపుః దధానే"** అని పలు విశేషణాలతో వర్ణింపబడ్డ అందాన్ని కల మేనిని ధరించినవానిపట్ల నాకు భక్తి కలగాలి" అని భీష్ముడన్నాడు. ఇచటి ధ్యాన శ్లోకాలలోకూడా "నీ అద్భుతమైన రూపం **"కమనీయం కరయో ర్యుగం దధత్"** (మనస్సును ఆకర్షించే కరయుగాన్ని ధరిస్తూ) అని, **"కనకద్రవగౌరమంబరం దధతో రుద్వితయేన సుందరమ్"** (కఱగించిన బంగారంవలె జ్వలించే పీతాంబరాన్ని ధరించిన ఊరువుల అందంతో కూడినది)అని, 50వ శ్లోకంలో **"దధతా జాంఘికతా మలౌకికీమ్"** (లోకోత్తరం అయిన వేగాన్ని కల గొప్ప రెండు మోకాళ్ళతో ముల్లోకాలు కొలిచే సన్నివేశంతో ప్రకాశించేది) అని, 52వ శ్లోకంలో **"పదయో ర్యుగం దధత్"** (పాదద్వయాన్ని వహించేది) అని, 53వ శ్లోకంలో **"వపురీదృశమీశ తావకం హృదయాలంబన మస్తు మే సదా"** (ఇటువంటి నీ దివ్యరూపం నాహృదయానికి గదా ధ్యానదర్శన విషయంగా ఉండాలి) అని కవి పలికాడు. భీష్ముని ధ్యానంలోని మొదటి శ్లోకంగల తీరు ఈ శ్లోకాలలో అంతర్గతంగా మెదులుతున్నదన్న అంశం సుస్పష్టం. భగవానుడు ఈ దివ్యరూపాన్ని భక్తమనోరంజనం కోసం ధరిస్తాడు. ఆ వపువు (మేని) భక్తమనోరంజనం కోసం పీతాంబరాన్ని ధరిస్తుంది. నటునివలె పలు పలు వేషాలను ధరించి విహరిస్తూ, వేఱొక విషయాన్ని తలపని అనన్యభావాన్ని కలవారికి అద్భుతరసాన్ని పోషిస్తున్నాడు" అని యాదవాభ్యుదయసూక్తి. గోపికలను మోహింపజేయడంలో దివ్య పీతాంబరం ముఖ్యమైన సామగ్రి. జనుల కన్నులను, బుద్ధిని మోహింపజేసే ఇంద్రజాలికులు ఈనాటికీ పీతాంబరాన్ని ధరిస్తారు. పీతాంబరధరులని వారి పేరు కూడా **"క్షామాశ్లిష్టం కి మపి"** అని ఊరుద్వయాన్ని భగవద్ధ్యానసోపానమనే స్తోత్రంలో దేశికులు స్తుతించారు. ఊరుద్వయసౌందర్యం పీతాంబరాన్ని ప్రేమతో ఆలింగనం చేసికొనేటట్లు చేసిందా! ఏమి! అని అచటి అనుభవం. **"విరాజమానోజ్జ్వలపీతవాససం స్మితాతసీసూనసమామలచ్ఛవిమ్"** అని స్తోత్రరత్నంలోని శ్రీయామునుల అనుభవం. భగవానుని దివ్యవర్ణానికి సైతం పరభాగశోభను కల్గించే అందం పీతాంబరానికి ఉన్నది. **"మహారజనం వాసః"** అనే స్వరూపంతో వచ్చిన ఔజ్జ్వల్యం ఇది. నడుము పూచినట్లున్న

మనస్సులను దోచుకోవడం కోసం పలు వేళ్ళను కలుపుకొని వేణువును మోగిస్తున్నట్లున్నది. **"ప్రాణభృతామ్"**–ప్రాణాలను కల్గిన అన్నిటియొక్క...భుజగాలవంటివి కూడా వశమైనవి–అని భావం. **"స్వే సృక్విణీరసనయా లిలిహుర్భుజంగాః"** (47) అని కూరేశుల అతిమానుషస్తవంలోని వర్ణనం. "గుంపులు గుంపులుగా గోకులంలోని కోడెలు, లేళ్ళు, పశువులు, వేణుగానంతో మనస్సు అపహరింపబడి నోటిలో కఱచిన గడ్డిపోచలతో, చెవులను రిక్కించి వింటూ కదలకుండా నిలువగా, నిద్రపోయి, చిత్రంలో చిత్రింపబడినట్లున్నవి"– అని శుకమహర్షి సూక్తి.

**శ్లో॥ ఉదరద్యుతినిమ్నగోచ్చల–**
**ల్లహరీరూపకరోమరాజికమ్।**
**పశుపాలవిలాసినీలస–**
**న్నయనాకర్షణనాభినిమ్నితమ్॥ 48**

ప్ర : ఉదరద్యుతి=ఉదరభాగంలోని శోభనుండి, నిమ్నగ+ఉచ్చలత్=ప్రవహించే ప్రవాహంలో పైకి లేచే, లహరీరూపక=కెఱటాలవలె తోస్తున్న, రోమరాజికమ్=రోమాల వరుసను కల్గినది, పశుపాలవిలాసినీ=గొల్లవనితెల, లసన్నయనాకర్షణ=అందమైన నేత్రాలను ఆకట్టుకొనే, నాభినిమ్నితమ్=నాభియొక్కలోతును(సుడిని)కల్గినది అయిన(వపుః).

**భావము :** **"నిమ్ననాభిమ్"** అనే స్తోత్రరత్నంలోని వర్ణనం కవి మనస్సులో స్ఫురిస్తున్నది. **"ఆవర్త ఇవ గంగాయాః"**–అనే రీతిలో సౌందర్యప్రవాహం సుడి తిరిగినట్లుండే నాభిని కలవాడు స్వామి. **"నన్దన్ మదలైక్కు నన్దు అళకియ వున్ది"** (నందుని కుమారునకు అందమైన బొడ్డు తగినది) అని ద్రావిడవ్యాఖ్యాతరసోక్తి. గోపయువతులను ఆకర్షించి తన గాంభీర్యంలోకి చేరుస్తుంది నాభీవర్తం. శ్రీకృష్ణుని నాభీవర్తం వారి నేత్రాలను ఆకర్షిస్తుంది. **"నవరోమరాజిః"** అనబడే, నాభికి పైన ఉండే రోమరాజి ఉదరభాగంయొక్క కాంతి కిందకు ప్రవహించి వచ్చే ప్రవాహమా! అన్నట్లున్నది. **"కాంత్యంభఃపరిపూర్ణం"** అయిన అలలవంటి వళిత్రయాలతో ప్రకాశించేది, గంభీరాకారం అయిన నాభియొక్క గొప్ప గుడి అందంతో కూడిన దామోదరమనే సౌందర్యసముద్రంలో నా చిత్తమత్స్యం చిరకాలం విహరించాలి" అని శ్రీశంకరులు విష్ణుపాదాది కేశాంతస్తోత్రంలో అన్నారు.

**శ్లో॥ కనకద్రవగౌరమంబరం**
**దధతోరుద్వితయేన సుందరమ్।**
**ఉదయన్మణినూపురప్రభా–**
**సరణిశ్రేణిజటాలజానుకమ్॥ 49**

**ప్రతిపదార్థము :** కనకద్రవ=బంగారాన్ని కఱగించి రూపొందించినట్లున్న, గౌరమ్ అంబరమ్=పీతాంబరాన్ని, దధతా=ధరించిన, ఊరుద్వితయేన=రెండు ఊరువులతో,



**ప్రతిపదార్థము :** దయామృతోదధే=దయ అనే అమృతానికి సముద్రంవంటివాడా!, దేవ=దేవా!, సురాపగాతుంగతరంగచాలితామ్=గంగయొక్క ఉన్నతమైన కెఱటాలచేత చలింపచేయబడింది, సుర+అసుర+ఆనీకలలాటలాలితామ్=దేవాసురసమూహాల లలాటాల చేత గౌరవంగా ధరింపబడేది అయిన, భవత్పదాంభోరుహధూళిధోరణీమ్=నీ పాదపద్మాల ధూళియొక్క సన్నిధిని, కదా=ఎపుడో కదా, దధే=ధరిస్తాను.

**భావము :** **"దయాసింధో! బంధో! నిరవధికవాత్సల్యజలధే!"** అనే స్తోత్రరత్నసూక్తిలోని భావం ఇందులో ప్రతిబింబిస్తున్నది. **"దయామృతోదధే!"** అని ప్రకృతంలో సంబోధన. గంగయొక్క నీటి అలలచేత చలిస్తుంది పాదపద్మం. ఇది సామాన్యమైన, నీటిలో ఉండే తామర కాదు. **"శ్రీమాధవాంఘ్రిజలజద్వయమ్"** గంగానదిలో ఉండి, అందలి కెరటాలచేత చలింపజేయబడే తామర. లోకంలో నీటిలో తామర పుడుతుంది. కాని, నీ పాదపద్మం నుండి గంగానదీప్రవాహం ఉత్పత్తి అయినది. లోకాలను పవిత్రం చేయడం కోసం కరుణతో నీ పాదం ప్రవహించే జలం పాదంనుండి పాదధూళినికూడా కలుపుకొని భూమండలంపై పడి ప్రవహించింది. పవిత్రమైన ఆ ధూళి స్పర్శను అందఱి తలలకు కల్గించాలని ఆ గంగ ఆశ. అచ్యుతుని పాదాలు చలింపచేయడానికి వీలు కానివే అయినా, వాని ధూళిని చలింపజేసి పోతున్నది. దేవాసురులు స్వామికి ప్రణామాన్ని చేసినపుడు వారు తమ ఫాలభాగాలపై ధూళిని సగౌరవంగా అద్దుకుంటున్నారు. **"త్రివిక్రమా!"** ఎపుడు నీ పాదపద్మం నా శిరస్సును అలంకరిస్తుందో కదా" అని కదా **"త్రివిక్రమ! త్వచ్చరణాంబుజద్వయం మదీయమూర్ధానమలంకరిష్యతి"**– (31) అనే స్తోత్రరత్న సూక్తి వలెనే ఇక్కడి కవి అనుభవం కూడా. పదాంభోరుహధూళిని ధరించడం అంటే పాదపద్మాన్ని శిరస్సుపై ధరించడం అనే తాత్పర్యం. గంగోత్పత్తి త్రివిక్రముని పాదాలనుండి. ఆ పాదాలు భూమినంతటినీ స్పృశిస్తూ కొలిచినట్లు, దానినుండి పుట్టిన గంగకూడా లోకాలను అన్నిటినీ స్పృశిస్తూ ప్రవహించింది. అదే రీతిలో **"త్రిస్రోతసం త్రిపథగా"** అయినది. **"త్రివిక్రమ"** అని అంటూ యామునులు సంబోధించడంతో ఇన్ని అర్థాలు ధ్వనిస్తున్నవి అని ఈ శ్లోకం ద్వారా వ్యంజితం.

**శ్లో॥ మహాజవాః ఛిన్నవివేకరశ్మయో**
**మహోద్ధతా దేవ! మదక్షవాజినః।**
**హరే (అలం) సమాసాద్య తవాంఘ్రిమందురా–**
**మపాస్తవేగా దధతాం సుశీలతామ్॥ 10**

**ప్రతిపదార్థము :** దేవ=దేవా!, హరే=హరీ!, మహాజవాః=అతివేగంగా పరుగెత్తేవి, ఛిన్నవివేకరశ్మయః=వివేకం అనే కళ్ళాలు తెగినవి, మహోద్ధతాః=గొప్ప పొగరును కల్గి ఉన్నవి అయిన, మత్ అక్షవాజినః=నా ఇంద్రియాలనే గుఱ్ఱాలు, తవ=నీయొక్క, అంఘ్రిమందురామ్ =పాదం అనే అశ్వశాలను, సమాసాద్య=చక్కగాచేరి, (అక్కడా పొందికగా

కట్టుబడి), అపాస్తవేగాః=వేగంగా పరుగెత్తడం మాని, చలించకుండా ఉన్నవై, సుశీలతామ్=సాధుత్వాన్ని, దధతామ్=వహించాలి.

**భావము : "ఇంద్రియాణి హయాన్యాహుః"** అని అంటూ కఠవల్లి ఇంద్రియాలను అశ్వాలుగా పల్కింది. **"దుష్టాశ్వా ఇవ సారథేః"** అని కూడా అన్నది. సాధువులైన ఇంద్రియాశ్వాలు మనం చేరి ఉండవలసిన నిలయం విష్ణుపదాన్ని చేరుస్తాయి. దుష్టాలైన ఇంద్రియాశ్వాలు అక్కడకు చేర్చకుండా బయటకు ఎక్కడికో ఎక్కడికో ఈడ్చుకొనిపోతాయి. **"విష్ణుపద"** శబ్దం పరమపదాన్నికూడా చెబుతుంది. పరమప్రాప్యం అయిన ఆ స్వామి పాదాన్నీ చెబుతుంది. (**"విష్ణోః పదే పరమే"** –అనే శ్రుతి వాక్యం స్మరణీయం). ఇక్కడ ఆ శ్రుతిని పాదపరంగా కవి అన్వయించి పలికాడు. **"మనః ప్రగ్రహమేవ చ"** అని శ్రుతి అన్నది. ఇక్కడ వివేకం కళ్ళాలుగా చెప్పబడింది. వివేకంతో కూడిన మనస్సు కళ్ళాలు. వివేకం లేకపోతే మనస్సు అనే కళ్ళెం తెగిపోయినదే అవుతుంది–అని తాత్పర్యం. కళ్ళాలను త్రెంచుకొని, దానిని కూడా ఈడ్చుకొని పోతాయి పొగరు పట్టిన అశ్వాలు. కళ్ళాలు గుఱ్ఱాలను నియమించి, అవి ఇష్టం వచ్చిన రీతిలో పరుగెత్తిపోకుండా నియమిస్తాయి. ఆ రీతిలో కాకుండ కళ్ళాలు తెగిపోయినపుడు ఇంద్రియాశ్వాలు రథాన్ని, రథిని కలిపి తప్పుదారిలోకి తీసికొనిపోతాయి–పలు పొగరుగుఱ్ఱాలు కళ్ళాలను తెంచుకొని అపమార్గంలోనికి ఈడ్చుకొనిపోతాయి. పలు సవతులు పలు విధాలుగా పతిని ఈడ్చుకొనిపోయి, హింసించేటట్లు" అని శ్రీశుకమహర్షి ఈ సందర్భాన్ని చమత్కరించాడు. **"హరే"** అనే పదం భగవానుని, అశ్వాలను తెలుపుతుంది. హరిశబ్దవాచ్యాలైన దుష్టాశ్వాల పొగరును హరించేవాడు హరి–భగవానుడు–అని ఇచటి ("హరే!" అనే సంబోధనలోని) స్వారస్యం. ఇంద్రియాశ్వాలను (హరులను) హరి నియంత్రిస్తాడు. **"మందురా"** అంటే అశ్వశాల. అక్కడ కట్టినట్లయితే దుష్టాశ్వాలు కూడా కదలకుండా నిలచి ఉంటాయి. నీ శ్రీపాదాల అందానికి లోబడి నా దుష్టేంద్రియాశ్వాలు వాటివద్ద నిశ్చయంగా అణగి ఉంటాయి– అని కవి హృదయం.

**శ్లో॥ పురాతనానాం వచసామగోచరం**
**మహేశితారం పురుషోత్తమం పతిమ్(హరిమ్)।**
**అపాస్య తం త్వాం నిరపత్రపా సతీ–**
**సతీ మతిర్మే కథమన్యమేష్యతి॥ 11**

**ప్రతిపదార్థము :** పురాతనానామ్=ప్రాచీనాలైన, వచసామ్=(నాల్గు) వేదాలకు, అగోచరమ్=కానరానివాడవు, మహేశితారం=ప్రభువులకుకూడా ప్రభువువు, పురుషోత్తమమ్=పురుషోత్తముడవు, పతిమ్=కాంతుడవు అయిన, తమ్=ప్రసిద్ధుడవైన, త్వామ్=నిన్ను, అపాస్య=వదలి, నిరపత్రపా సతీ=లజ్జ లేనిదై, సతీ మే మతిః=పతివ్రతావ్రతాన్ని కల నా బుద్ధి, కథమ్=ఏ విధంగా, ఏష్యతి=పొందుతుంది?



**వనామలస్రజమ్"** అనే పాఠాంతరం చూపబడింది. **"లసత్తులస్యా వనమాలయోజ్జ్వలమ్"**, **"చకర్థ యస్యా భవనం భుజాంతరమ్"** (37) అనే స్తోత్రరత్నాన్ని అనుసరిస్తున్నాడు కవి. వక్షఃస్థలంలో లక్ష్మీదేవిని, వనమాలను చేర్చిన అనుభవం. ఒక మెఱపు తీగ.

**శ్లో॥ మణికంకణకాంతిమాంసలం**
**దరపుల్లాంబుజసుందరద్యుతి।**
**పతితోద్ధరణే దృఢవ్రతం**
**కమనీయం కరయోర్యుగం దధత్॥ 46**

**ప్రతిపదార్థము :** మణికంకణకాంతిమాంసలమ్=రత్నకంకణాల కాంతులు మిక్కిలిగా వ్యాపించినది, దరపుల్ల+అంబుజసుందరద్యుతి=కొంచెం వికసించిన తామరపూవుయొక్క అందమైన శోభను కల్గినది, పతిత+ఉద్ధరణే=పతితులకు చేయూతనిచ్చి ఉద్ధరించడంలో, దృఢవ్రతమ్=దృఢమైన గట్టి దీక్షను కల్గినది, కమనీయమ్=మనస్సును దోచేది అయిన, కరయోః యుగమ్=శ్రీకరద్వయాన్ని, దధత్=ధరించేది అయిన (వపుః).

**భావము : "చకాసతం జ్యాకిణకర్కశైః శుభైః చతుర్భి రాజానువిలంబిభిః భుజైః"** (33) అని స్తోత్రరత్నంలో స్వామి చతుర్భుజాల వర్ణన చేయబడింది. అక్కడ శ్రీ వైకుంఠంలోని స్వామి వర్ణనం. కంసవధకు పిమ్మట శ్రీకృష్ణునకు చతుర్భుజావిర్భావం. ఇక్కడ కవి గోకులంలోని గోపాలుని అందాన్ని అనుభవిస్తున్నాడు. అందువల్ల **"కరయోర్యుగమ్"** అని ప్రయోగం. **"బాహుం భుజగభోగాభమ్"** అని వాల్మీకిమహర్షి శ్రీరాముని భుజాలను వర్ణించడాన్ని దృష్టిలో పెట్టుకొని **"భుజగాకారభుజమ్"** అని ముందు శ్లోకంలో వర్ణించాడు కవి. **"హస్తావలంబనం హ్యేకః"**–చేయూతనిచ్చి ఉద్ధరించేవాడు జనార్దనుడు.

**శ్లో॥ వరరత్నమయాంగులీయకా–**
**వలిశోభామిలితాంగులీగణైః।**
**ముహురాకులితేన వేణునా**
**వశయత్ ప్రాణభృతాం మనఃశ్రుతీః॥ 47**

**ప్రతిపదార్థము :** వరరత్నమయ=గొప్ప రత్నాలు పొదిగిన, అంగులీయక+ఆవళి=పలు అంగులీయ కాల, శోభామిళిత=కాంతితో కూడిన, అంగులీగణైః=పలు వేళ్ళతో, ముహుః=మాటిమాటికి, ఆకులితేన=మోగింపబడ్డ, వేణునా=వేణువుతో, ప్రాణభృతామ్=ప్రాణాలను కలవారియొక్క, మనఃశ్రుతీః=మనస్సులను, చెవులను, వశయత్=వశీకరించుకొనే(వపుః)

**భావము :** వేళ్ళలో గల అంగులీయకాల రత్నకాంతులు వేళ్ళవలె శోభిస్తున్నవి. పలు వేళ్ళు చేరి ఉన్నట్లున్నది. నిజంగా ఉన్న వేళ్ళతోను, కాంతి ప్రభలైన పలు వేళ్ళతో చేరి వేణువును మోగిస్తున్నట్లున్నది. అయిదు వేళ్ళతో మాత్రమే వాయిస్తున్నట్లు లేదు. గోపీగణాల

**భావము :** **"కోమలగండమ్"** (35) అని స్తోత్రరత్నంలోని ప్రయోగం. బృందావనసంచారికి తగినట్లు పూలగుత్తి కర్ణంలో ఆభరణంగా ధరింపబడింది.

**శ్లో॥ పృథువర్తులమౌక్తికావలీ-**
**సుషమావేల్లితకాంతకంధరమ్।**
**హరినీలగిరిద్యుతిద్రుహో**
**కమలామందిరవక్షసాంచితమ్॥ 44**

**ప్రతిపదార్థము :** పృథు=పెద్దది, వర్తుల=గుండ్రనిది, మౌక్తిక+ఆవలీ=ముత్యాలహారంయొక్క సుషమా=కాంతుల, వేల్లిత=అలలతో కూడిన, కాంత=అందమైనది అయిన, కంధరమ్= కంఠంతోను, హరినీలగిరిద్యుతి=ఇంద్రనీలపర్వతాన్ని కాంతితో, ద్రుహో=స్పర్ధించేది, కమలామందిరవక్షసా=లక్ష్మియొక్క వాసగృహం అయిన వక్షఃస్థలంతో, అంచితమ్=శోభిల్లేది అయిన (వపుః)

**భావము :** **"ఉదగ్రపీనాంసవిలంబికుండలాలకావలీబంధురకంబుకంధరమ్"** (34) అని స్తోత్రరత్నంలోని వర్ణన. **"బంధురమ్"**-అంటే **"కాంతమ్"** అని అర్థం. ఇక్కడ **"కాంతకంధరమ్"** అని ప్రయోగం. **"మురభిదురో మందిరామిందిరామ్ తామ్"** అని శ్రీశంకరులు లక్ష్మిని మురారి వక్షఃస్థలాన్ని మందిరంగా కల్గినదని అన్నారు. అట్లే, ఇక్కడ **"కమలామందిరవక్షసా"** - కమలామందిరమైన వక్షస్సుతో-అని కవి ప్రయోగం.

**శ్లో॥ చరణాబ్జనఖావలంబినీం**
**భుజగాకారభుజాంతరాగతామ్।**
**నిబిడాభ్రమివ క్షణప్రభాం**
**వహదుత్ఫుల్లవనామలస్రజమ్॥ 45**

**ప్రతిపదార్థము :** చరణ+అబ్జనఖ+అవలంబినీమ్=పాదపద్మాల నఖాల పర్యంతం వేలాడి ఉండేది, నిబిడ+అభ్రమ్=ఘనమైన మేఘాన్ని, క్షణప్రభామ్ ఇవ=మెఱపు చేరినట్లుగా, భుజగ+ఆకార భుజ+అంతరాగతమ్=భుజగంవంటి భుజాల మధ్యభాగం అయిన నల్లని వక్షఃస్థలాన్ని పొందినది అయిన, ఉత్ఫుల్లవన+అమలస్రజమ్=వికసించిన, శుద్ధమైన వనమాలను, వహత్=ధరించేది అయిన (వపుః)

**భావము :** వక్షఃస్థలంలో ధరింపబడ్డ వనమాల శ్రీపాదాల నఖ పర్యంతంవరకు చేరి, శ్రీపాదాలపై పడుతున్నట్లున్నది. భగవానుని బాహువుల్లో చేరి ఉండే శంఖచక్రాలు శ్రీపాదాలలోని రేఖలుగా చేరి, అక్కడే అంకితమై ఉన్నట్లే ఇది కూడా. వనమాల నల్లని వక్షఃస్థలంలో మెఱపుతీగవలె ప్రకాశిస్తున్నది. **"వహత్"** అనే పాఠం ఉచితం. వక్షః స్థలంలో వనమాలను దాల్చే మేని-అని భావం **"చపలా మనుశాయినీమివోద్వహదుత్ఫుల్ల**



**భావము :** **"మహేశ! హాతుం తవ పాదపంకజమ్"** అని, **"కః పుండరీకనయనః పురుషోత్తమః కః"** (12) అని, **"కవయే నిరపత్రపాయ"** అని, **"మామలజ్జమ్"** అని మొదలైన స్తోత్రరత్న ప్రయోగాలు ఇక్కడ ఈ శ్లోకరచనలో కవి హృదయంలో మెదలుతున్నాయి. ముందు శ్లోక రచనలో **"విషయాం స్తేషు గోచరాన్"** అనే కఠవల్ల్యుపనిషత్తు కవి హృదయంలో మెదలింది. ఇక్కడ **"గోచర"** శబ్దం మెదలుతున్నది. **"మహేశ్వర"** అని సంబోధించి ఉన్నట్లయితే, **"మహేశ్వరస్త్ర్యంబక ఏవ నాపరః"** అనే కాళిదాసవచనానుసారం అది ఈశ్వరుని సంబోధించినట్లే అయివుండేది. ఆ శ్లోకంలో **"హరిర్యదైకః పురుషోత్తమః స్మృతః"** అనే దానిని **"పురుషోత్తమః కః"** అని యామునులు స్మరించినట్లే, ఇక్కడకూడా జగన్నాథకవి తలుస్తున్నాడు. అదే శ్లోకంలో కాళిదాసు మహేశ్వరశబ్దం ఈశ్వరుని ఒక్కని మాత్రమే తెలుపుతుందని అన్నందున, ఆ శబ్దాన్ని ప్రయోగించకుండా **"మహేశ"** అని శ్రీ యామునులు ప్రయోగించారు. పురుషోత్తమశబ్దం విష్ణువునకు అసాధారణం అనే దానికి కాళిదాస రచన సాక్షి అని తలచినపుడు, వెనువెంటనే మహేశ్వర శబ్దం శివునకు అసాధారణమనికూడా ఏర్పడుతుంది. ఇక్కడ పురుషోత్తమశబ్దంతో **"మహేశితారమ్"** అని ప్రయోగించడంలో ఇదే హృదయం. నా బుద్ధి పతివ్రత. పురుషసూక్తం కీర్తించే పురుషుడెవడో, అతడే విశ్వానికి అంతటికీ పతి. అతడే నా మతి అనే కన్యకకు పతి. సిగ్గులేకుండా ఇంకొక పురుషుని సతి అయిన నా మతి కోరదు-అని అంటున్నాడు కవి. ఈ శ్లోకంలో **"నిరపత్రపా"** అని ప్రయోగం. 19వశ్లోకంలో **"గళితత్రపస్య మే"** అని ప్రయోగం. మళ్ళీ, 56వ శ్లోకంలో **"నిస్త్రపః"** అని ప్రయోగం. శ్రీయామునులు స్తోత్రారంభంలో **"నిరపత్రపాయ"** అని ప్రారంభించి, 47వ శ్లోకంలో **"మామలజ్జమ్"** అని అన్నారు.

**శ్లో॥ న జాగ్రతా స్వప్నగతేన వా మయా**
**సమీహితం తే కరుణాలవాదృతే।**
**గిరం మదీయాం యది వేత్సి తాత్త్వికీం**
**తదా జగన్నాయక! మామురీకురు॥ 12**

**ప్రతిపదార్థము :** జగన్నాయక=లోకనాథా!, జాగ్రతా=మేల్కొని ఉన్నవాడనైనపుడుగాని, స్వప్నగతేన వా=స్వప్నాన్ని పొందినవాడనైనపుడుగాని నాచే, తే=నీయొక్క, కరుణాలవాదృతే= కరుణయొక్క అతిచిన్న భాగం లేకుండా (కాకుండా), మయా=నాచే, న సమీహితమ్= ఒక్కటికూడా చేయబడలేదు, ఒక ఆశకూడా పడలేదు, మదీయామ్=నాయొక్క, గిరమ్= మాటను, తాత్త్వికమ్=నిజం అని, యది వేత్సి=తెలిసికొన్నవాడవు అయితే, తదా= అపుడే, మామ్=నన్ను, ఉరీకురు=అంగీకరించాలి.

**భావము :** నీ దయను తప్ప నేను వేఱు దేనినీ మేల్కొని ఉన్నపుడు, స్వప్నంలో కూడా ఏ ఆశ పడలేదు. ఏ పనీ చేయలేదు. నీ దయ లేకుండా నేను ఏ ప్రయత్నాన్ని చేయగలను?

నా నోటినుండి వచ్చే ఆర్తివచనాలను నీవు ఏ క్షణంలో నిజమని భావిస్తావో, అపుడే నన్ను అంగీకరించాలి. ఈ ఆర్తి వచనాలు నా నోటినుండి నిజంగా రావడం నీ కరుణ వల్లనే సుమా! అని భావం. **"నిదానం తత్రాపి స్వయమ్"** జగన్నాథుడే నా మతికి నాయకుడు. "అదువుమ్ అవనదు ఇన్నరుళే" (నా శరణాగతి వాక్కుకూడా భగవానుని దయాకార్యమే) అని **శఠకోపసూరి** వాక్కు.

**శ్లో॥ అయి! దీనతరం దయానిధే!**
**దురవస్థం సకలైస్సముజ్ఝితమ్।**
**అధునాపి న మాం నిభాలయన్**
**భజసే హా! కథమశ్మచిత్తతామ్॥ 13**

**ప్రతిపదార్థము :** అయి దయానిధే=ఓ దయానిధీ! సకలైః=అందరిచేత, సముజ్ఝితమ్ =చేయి విడువబడ్డవాడను, దీనతామ్=దీనుడను, దురవస్థమ్=పరమాపదను పొందినవాడను అయిన, మామ్=నన్ను, అధునా అపి=ఇప్పుడు కూడా, న నిభాలయన్=కన్నెత్తి చూడకుండా, హా=అయ్యో! కథమ్=ఏ విధంగా, అశ్మచిత్తతామ్=రాతిగుండె స్వభావాన్ని, భజసే= పొందుతున్నావు?

**భావము :** ఈ కృతిలో మొదటి పన్నెండు శ్లోకాలు **వంశస్థ వృత్త బద్ధాలు. వంశస్తనితం వైతాళీయం** అని పేరు. వంశం అంటే వేణువు. ఇది కృష్ణునకు చాలా ప్రియం. ఈ శ్లోకాలు వేణుగానం వలె మధురమైనవి. **"షాడ్గుణ్యప్రగుణా నీతిః వంశస్థేన విరాజతే"** షాడ్గుణ్య పరిపూర్ణుడైన వాసుదేవుని స్తుతించడానికి తగిన వృత్తం. ద్వాదశాక్షర మంత్ర సంఖ్యను అనుసరించి ఆ వృత్తంలో 12 శ్లోకాలు రచింపబడ్డాయి. ఇకనుండి 42 శ్లోకాలు **వియోగినీ వృత్తం**లో రచింపబడుతున్నాయి. శ్రీకృష్ణుని శరణు పొందినా, అతడు తన ముఖాన్ని చూపించలేదే! అనే విరహంచేత తపించే వారు తమ ఆర్తిని వ్యక్తం చేయడానికి తగిన వృత్తం ఇది. అజవిలాపం, రతివిలాపం రెండిటినీ ఈ వియోగినీ వృత్తంలోనే కాళిదాసు వర్ణించాడు. స్తోత్రరత్నంలో కూడా **"అపరాధసహస్రభాజనమ్"** అని ప్రారంభించి తొమ్మిది శ్లోకాలు ఈ వృత్తంలోనే నిబద్ధాలు. కరుణరసానుకూలం అయినది. ప్రకృతంలో **"దీన"** శబ్దం కార్పణ్యాన్ని సూచిస్తుంది. దీనితోపాటు **"త్రప"**ను కూడా చేర్చాడు కవి. **"అయి"** అనే సంబోధన దైన్యాన్ని సూచిస్తుంది. నీకు అత్యంత ప్రియుణ్ణి నేను. **"ప్రియో హి స చ మమాత్యర్థమ్"**. నన్ను చేయి విడువవచ్చునా! అని దీనంగా ప్రార్థించడాన్ని ఇది తెలుపుతుంది. **"దయానిధే"** దయ అనేది పాలవంటిది. రాతిగుండెకు ఇది సాక్షాద్విరోధి. **"సముజ్ఝితమ్**–విడువబడ్డ నన్ను. **"న నిభాలయన్"** ఛాందోగ్యంలోని సద్విద్యలో **"న నిభాలయసే"** అని శ్వేతకేతువును చూచి అతని తండ్రి ప్రయోగించిన శబ్దాన్ని కవి ఇక్కడ ప్రయోగిస్తున్నాడు. మఱ్ఱిచెట్టులో ఉండే చిన్న విత్తనాన్ని విడదీయమని పల్కి,



స్ఫురత్=ప్రకాశించే, ముకుట=కిరీటం, ఆకుంచిత=చుట్టుకున్న (గుండ్రని), కాంత= అందమైన, కుంతలమ్=కేశాలు అనే వీటిని కల్గినది, కమనీయతర=మిక్కిలి అందమైన, అలకావలి=కేశాల సమూహంయొక్క, భ్రమణ=భ్రమణంచేత, భ్రాజి=శోభించే, లలాట= నుదురుచేత, సుందరమ్=అందమైనది అయిన (వపుః=దివ్యరూపం).

**భావము :** ఇక క్రమంగా కవి శ్రీకృష్ణుని దివ్యమంగళరూపాన్ని శిరస్సునుండి శ్రీపాదాల వరకు వర్ణిస్తున్నాడు. అందంలో అభినివేశాన్ని పొందినవారు శిరస్సునుండి వర్ణనను ప్రారంభిస్తారు. **"స్ఫురత్ కిరీట"** అని స్తోత్రరత్నంలోని దివ్యమంగళ విగ్రహవర్ణన ప్రారంభం. ఇక్కడ **"స్ఫురన్మకుట"** అని ప్రారంభం. **"లలాటపర్యంతవిలంబితాలకమ్"** (35) అని స్తోత్రరత్న వర్ణనం. ఇక్కడ **"అలకావలీభ్రమణభ్రాజిలలాటసుందరమ్"** అని. కేశవుడనే శ్రీకృష్ణుని నామానికి **"ప్రశస్తకేశవాన్"**–అందమైన కేశాలను గలవాడు–అని కూడా అర్థం.

**శ్లో॥ శరదిందుసహోదరాననం**
**దలదంభోజపలాశలోచనమ్।**
**అరుణాధరకాంతిదంతుర–**
**స్ఫుటదంతాంశువికాసితాంబరమ్॥ 42**

**ప్రతిపదార్థము :** శరత్+ఇందుసహోదర+ఆననమ్=శరత్కాలచంద్రునివంటి ముఖంలోను, దలత్+అంభోజ పలాశలోచనమ్=అపుడే వికసించే తామరపూవురేకువంటి కన్నులతోను, అరుణాధరకాంతిదంతుర=ఎఱ్ఱని అధరపు కాంతితో మెఱిసే, స్ఫుట=తెల్లని, దంతాంశు= దంతాల కాంతిచే, వికాసిత=వ్యాపించి, తెల్లగా ప్రకాశింపజేయబడ్డ, అంబరమ్=ఆకాశంతో కూడిన, (లేక) వస్త్రంతో కూడిన (వపుః=దివ్యరూపం)

**భావము : "ముఖశ్రియా న్యక్కృతపూర్ణనిర్మలామృతాంశుబింబాంబురుహోజ్జ్వలశ్రియమ్"** (34) అని, **"ప్రబుద్ధముగ్ధాంబుజచారులోచనమ్"** (35) అని గల స్తోత్రరత్నంలోని ప్రయోగాలు ఇక్కడ స్మరణీయాలు.

**శ్లో॥ దరపాండురగండమండల–**
**ప్రతిసర్పత్కమనీయకుండలమ్।**
**మణిమౌక్తికమంజుమంజరీ–**
**మహనీయద్యుతిరంజితశ్రుతి॥ 43**

**ప్రతిపదార్థము :** దర=కొంచెం, పాండుర=తెల్లని, గండమండల=చెక్కిళ్ళలో, ప్రతిసర్పత్= వ్యాపించి ప్రకాశించే, కమనీయకుండలమ్=అందమైన కుండలాలతో, మణిమౌక్తిక= ముత్యాలు, మణులు, మంజుమంజరీ=అందమైన పూలగుత్తులు –అనే వీని, మహనీయద్యుతి=గొప్ప కాంతులతో, రంజితశ్రుతి=శోభించే చెవులతో కూడిన, (వపుః =రూపం)

మార్చి, **"అరవిందాక్ష"** అని పిలుస్తున్నాడు. నిన్ను పరిణయమాడడంలో రుక్మిణీదేవికి గల ఆశవలె నిన్ను దర్శించాలని నాకుగల ఆశ చాలా దొడ్డది– అని దీనిద్వారా కవి సూచిస్తున్నాడు.

**శ్లో॥ హరినీలమయావనీతలే**
**వరవృందావిపినే విలాసిని।**
**మణిమండపమధ్యవిస్ఫుర–**
**ద్విబుధక్ష్మారుహమూలమాశ్రితమ్॥ 40**

**ప్రతిపదార్థము :** హరినీలమయావనీతలే=ఇంద్రనీలరత్నమయం అయిన భూతలంలో, విలాసిని=శోభనుగల, వరవృందావిపినే=ఉత్కృష్టం అయిన బృందావనంలో, మణిమండప =మణిమండపంలోని, మధ్య=నడుమ, విస్ఫురత్=ప్రకాశించే, విబుధక్ష్మారుహ= దేవవృక్షం అయిన పారిజాతంయొక్క, మూలమ్=పాదాన్ని, ఆశ్రితమ్=ఆశ్రయించి ఉండే, వపుః= శరీరం, మమ=నాయొక్క, మానసగోచరీభవతు=మనస్సుకు విషయం కావాలి (ఈ శ్లోకం నుండి 52వ శ్లోకం వరకు ఒక్కొక్క శ్లోకాన్ని ఇదే రీతిలో 39వ శ్లోకంలోని "వపుః" అనే పదానికి విశేషణంగా అన్వయించుకోవాలి)

**భావము :** స్తోత్రరత్నంలోవలె ఇక్కడ కూడా 15శ్లోకాలతో, 15కళలతో పూర్ణుడు అయే పూర్ణచంద్రుడు అజ్ఞానతిమిరాన్ని తొలగిస్తూ అన్ని కళలతో పూర్ణంగా ఆవిర్భవించేటట్లు, హృదయాకాశంలో విగ్రహంయొక్క సంపూర్ణమైన ఆవిర్భావం వర్ణింపబడుతున్నది. బృందావనంలోని కొన్ని కుంజాలలో ఈ నాటికీ శ్రీకృష్ణుడు దర్శనమిస్తాడని పెద్దలు అంటారు. **"హరినీలశిలావిభంగనీలా"** అనే గోపాలవింశతిలో గోపాలుని మేని కాంతి భావించబడింది. ఇచట ఇంద్రనీలమణి మేనికి ఉపమ. ఇక్కడ ఆననానికి ఉపమ. శ్రీకృష్ణుని మేనికి అనురూపమైన ఆననం. **"బిభ్రద్భిన్నే స్ఫటికరుచిరే పుండరీకే నిషణ్ణః"** అని శ్రీలక్ష్మీహయగ్రీవస్వామి ఆననపద్మంయొక్క వర్ణనం. అక్కడ తెల్లని స్ఫటికశిల తెల్లని తామరకు ఉపమానం. **"శుద్ధమణిభూభృత్ ప్రతిభటుడు"** అయిన శ్వేతాశ్వ ముఖమునకు తగిన ఆననం. **"వరపుండరీకే బద్ధాననః"–"బృందారణ్యమ్" "బృందావనమ్ నామ"** అని భాగవతంలోని ప్రయోగాలు.

**శ్లో॥ శిఖిపింఛమహామణిస్ఫుర–**
**న్ముకుటాకుంచితకాంతకుంతలమ్।**
**కమనీయతరాలకావలిభ్రమణ–**
**భ్రాజిలలాటసుందరమ్॥ 41**

**ప్రతిపదార్థము :** శిఖిపింఛ=నెమలిపింఛం, మహామణి=అందమైన మణి–అనే వీటిచే,



"దానిలోపల ఏమి చూస్తున్నావు?" అని ప్రశ్నించినపుడు పుత్త్రుడు "దానిలోపల ఏమీ చూడలేకున్నాను" అని బదులు పల్కాడు. ఆ విత్తులో ఈ పెద్ద మఱ్ఱిచెట్టు ఉన్నది. అది చాలా సూక్ష్మంగా ఉన్నందున నీవు చూడలేకున్నావు. అదే రీతిలో పరబ్రహ్మం చాలా సూక్ష్మంగా సూక్ష్మవస్తువులలో కూడా ఉన్నది. అది అపరసూక్ష్మంగా ఉన్నందున నీవు చూడలేదు– అని తండ్రి అన్నాడు. **"స య ఏషో అణిమా"** అని అన్నాడు. పరబ్రహ్మవైన నిన్ను మేము దర్శించలేకపోవడం తగినదే! విపశ్చిత్తు, సర్వజ్ఞుడవు, సర్వవిత్తువు అయిన నీకు నన్ను చూడడం అరుదా!"– అనే పరిహాసాన్ని పురస్కరించుకొని ఆ శబ్దాలను ఇక్కడ ప్రయోగించే రసం చాలా సుందరం. మా మనస్సు రాయిగా ఉండవచ్చు. నీ మనస్సు ఆ విధంగా ఉండవచ్చు. "తల్లి మనస్సు వెన్న, కొడుకు మనస్సు సున్న"– అని కదా సామెత.

**శ్లో॥ సుమహాంతి జగంతి బిభ్రత–**
**స్తవ యో నావిరభూన్మనాగపి।**
**స కథం పరమాప్త! దేహినాం**
**పరమాణోర్మమ ధారణే శ్రమః॥ 14**

**ప్రతిపదార్థము :** దేహినామ్=దేహాన్ని కల జీవులకు, పరమాప్త=మిక్కిలి ఆప్తుడవై ఉండేవాడా! సుమహాంతి=చాలా పెద్దవి అయిన, జగంతి=లోకాలను, బిభ్రతః=భరిస్తున్న, తవ=నీకు, మనాక్ అపి=కొంచెం కూడా, యః శ్రమః=ఏ అలసట, న+ఆవిరభూత్=కలుగలేదో, పరమాణోః మమ=అతిసూక్ష్మమైన అణువుకంటె అణువైన నాయొక్క, ధారణే= ధరించడంలో, కథమ్=ఎట్లు, సః శ్రమః=ఆ శ్రమ కల్గుతుంది?

**భావము :** సద్విద్య ముందు శ్లోకంలో కవి మనస్సున మెదలినందున **"స య ఏషో అణిమా"** అనే శ్రుతి ప్రసక్తమైనది. బ్రహ్మను **"అణిమా"** అని శ్రుతి అన్నది. నీవు అణువు కాగలవు. అంతటా వ్యాపించే విభువు కాగలవు. నేను అణువు మాత్రమే. నేను విభువును కాను. లోకాలను అనాయాసంగా మోసే నీకు అణువైన నన్ను ధరించడంలో ఏం శ్రమ? **"పరమాత్మ దేహి నః"** అని పాఠాంతరం. లోకానికి ఆత్మవైన నీకు విశ్వం శరీరం. అపుడు నేను కూడా నీకు శరీరమే. నీ దేహం అయిన లోకాలను అనాయాసంగా ధరించే నీకు నీ దేహం అయిన ఈ అణువస్తువును దాల్చటంలో శ్రమ ఉంటుందా?

**శ్లో॥ నితరాం వినయేన పృచ్ఛతే**
**సువిచార్యోత్తరమత్ర యచ్ఛ మే।**
**కరితో గిరితోఽప్యహం గురు–**
**స్త్వరితో నోద్ధరసే యదద్య మామ్॥ 15**

**ప్రతిపదార్థము :** నితరామ్=మిక్కిలి, వినయేన=వినయంతో, పృచ్ఛతే=ప్రశ్నిస్తున్న, మే=నాకు, అత్ర=ఈ ప్రశ్నకు, సువిచార్య=బాగా ఆలోచించి, ఉత్తరమ్=సమాధానాన్ని, యచ్ఛ=ఇవ్వాలి. అద్య=ఇపుడే, మామ్=నన్ను, త్వరితః=వేగంగా, యత్ నోద్ధరసే=ఉద్ధరించకపోతున్నావు ఎందుకు? అహమ్=నేను, కరితః=గజేంద్రునికంటే, గిరితః=గోవర్ధనపర్వతంకంటే, గురుః=బరువైనవాడనా!

**భావము : "తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్"** అని గీతలో నీవు స్థిరంగా చెప్పిన సూక్తి. అణువైన నేను ఆత్మను ధరించడం కష్టమా! అని అడిగాను. దేహమే ఆత్మ అని, దేహపరిమాణాన్ని కల్గినది ఆత్మ అని కొందరు అంటారు. గీతలో కూడా **"అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్"** అని పక్షాంతరాలనుకూడా పల్కి సమాధానం ఇవ్వబడింది. "నీ దేహాన్ని నేను ఏవిధంగా మోయడం?" అని భగవానుడు అన్నట్లు తలచి, గజేంద్రునికంటె నేను బరువా! గోవర్ధనంకంటే నేను బరువా! అని కవి ప్రశ్నిస్తున్నాడు. **"త్వరితః-భగవత స్త్వరాయై నమః"** అని భగవానుని త్వరకు నమస్కారం చేయబడింది. తన విజయంలో భగవానుని త్వరకోసం ఆశపడుతున్నాడు కవి.

**శ్లో॥ న ధనం న చ రాజ్యసంపదం**
**న హి విద్యామిదమేకమర్థయే।**
**మయి ధేహి మనాగపి ప్రభో!**
**కరుణాభంగితరంగితాం దృశమ్॥ 16**

**ప్రతిపదార్థము :** ప్రభో=ఓ ప్రభూ!, ధనమ్=ధనాన్ని, న అర్థయే=కోఅను, రాజ్యసంపదం చ=రాజ్యలక్ష్మిని, న అర్థయే=ప్రార్థించను, విద్యామ్=విద్యను, న హి అర్థయే=కోఅను, ఇదమ్ ఏకమ్ ఏవ అర్థయే=దీనిని ఒక్కటిని మాత్రం కోఅతాను, అది ఏమి అంటే, మనాక్ అపి=కొంచెం కూడా, మయి=నాలో, కరుణాభంగితరంగితామ్=దయయొక్క తరంగాలతో కూడిన, దృశమ్=దృష్టిని, ధేహి=ఉంచాలి.

**భావము :** సంపదను కోఅను, రాజ్యాన్ని వేడను, విద్యను ప్రార్థించను. నీ కృపా కటాక్షాన్ని ఒక్కటిని మాత్రం అర్థిస్తున్నాను అని కవి అంటున్నాడు. **"ఘనకరుణారసౌఘభరితాం పరితాపహరాం నయనమహచ్ఛటాం మయి తరంగయ రంగపతే!"** ఇత్యాదులు స్మరణీయాలు. **"ఆజ్ఞాం ఖ్యాతిం ధనమనుచరా నాధిరాజ్యాదికం వా"** అనే దయాశతక శ్లోకార్థాన్ని స్మరించాలి. **"న దేహం న ప్రాణాన్ న చ సుఖమ్"** అనే స్తోత్రరత్న శ్లోకభావం ఇందులో ఒక విధంగా ఉపబృంహితం.

**శ్లో॥ అయమత్యధమోఽపి నిర్గుణో**
**దయనీయో భవతా దయానిధే!**



**నిర్దయం మామలజ్జం ....... విధిశివసనకాద్యైః ధ్యాతుమత్యంతదూరమ్"** అనే యామున శ్లోకాన్ని(47) ప్రస్తుతంలో కవి అనుకరించడం స్పష్టం. ఇక్కడ తనకు శ్రీకృష్ణుని భజనం చేసే రీతిని ఆచరించి చూపే విశ్వాచార్యులైన విధిశివాదులను తన భజన ప్రారంభంలో కీర్తించాడు. యామునులు స్తోత్రాన్ని రచించారు. నేను స్తోత్రం రచించకపోయినా దోషం లేదు. నేను ఈ రీతిలో దూషిస్తున్నాను. నాకంటే నీచుడున్నాడా!

**శ్లో॥ అథ సర్వమిదం మయోజ్ఝితం**
**భవతోఽన్యన్నహి కించిదర్థయే।**
**మమ మానసగోచరీభవ-**
**త్వరవిందాక్ష! తవాద్భుతం వపుః॥ 39**

**ప్రతిపదార్థము :** అథ=మంగళం కల్గుగాక (లేక) తరువాత, సర్వ మిదమ్=ఇది అంతా, మయా=నాచే, ఉజ్ఝితమ్=విడువబడినది, భవతః=నీవద్దనుండి, అన్యత్ కించిత్=ఇంకొకటిని కూడా, న అర్థయే=ప్రార్థించను (దీనిని మాత్రమే అర్థిస్తున్నాను), అరవిందాక్ష=పుండరీకాక్షా!, తవ=నీయొక్క, అద్భుతమ్=ఆశ్చర్యకరం అయిన, వపుః=విగ్రహం, మమ=నాకు, మానసగోచరీభవతు=మనసుకు గోచరించాలి (దీనిని మాత్రమే అర్థిస్తున్నాను).

**భావము :** "ఏమి ఇన్ని మాటలు పల్కుతున్నావు? నీకేమి కావాలో దానిని చెప్పకూడదా!" -అని కృష్ణుని అభిప్రాయమని భావించి, కవి బదులిస్తున్నాడు. ఇక దీనిని అంతా విడిచిపెట్టాను స్వామీ! ఇంకదేనిని నీవల్ల పొందాలని కోఅను. దీనిని మాత్రమే అర్థిస్తున్నాను. అది ఏమి? అని అంటావా! తామరసనేత్రుడవైన నీ అద్భుతమైన దివ్యమంగళవిగ్రహం నా మనస్సులో దర్శనం ఇవ్వాలి, దానిని సదా నేను సేవించాలి. ఆ సేవకు భంగం రాకూడదు. **"అథ"** అనేది శబ్దధ్వని మాత్రంతోనే మంగళాన్ని తెల్పుతుంది. అది మాంగలికమైన పదం. ఇకపై - అనే అర్థాన్నికూడా ఇస్తుంది. **"భవతః అన్యత్ న హి కించిత్ అర్థయే"**- అనేదానికి "నిన్నుతప్ప వేఱు దానినీ నేను కోఅను"-అనే అర్థాన్ని గ్రహిస్తే, భగవానుని స్వరూపం కవి మనస్సుకు విషయం కావడం సాధ్యం కాదు అని ఆక్షేపించగా, శుభశ్రేయం అయిన దివ్యమంగళరూపం నా కంటికి విషయం కావాలి-అని కవి ప్రార్థిస్తున్నట్లుగా కూడా గ్రహించవచ్చు. ఇచట కవి ధ్యానం చేయగోరుతున్నాడు. స్వరూపధ్యానం దుర్లభం. దివ్యమంగళవిగ్రహధ్యానం సులభం. కృష్ణుని ధ్యానాన్ని **"అథ"** అనే మంగళశబ్దంతో ప్రారంభిస్తున్నాడు. **"అద్భుతమ్"** అని అనడం ద్వారా **"తమద్భుతమ్"** అనే శుకుని అనుభవాన్ని స్మరిస్తున్నాడు **"అంబుజేక్షణమ్"** అనే విష్ణుపురాణ ప్రయోగాన్ని **"అరవిందాక్ష"** అని పల్కి అనుసరిస్తున్నాడు. భగవానుడు చేసే ఆలస్యాన్ని కవి సహించలేకపోయాడు. వెంటనే దర్శనమివ్వాలి. సదా దర్శనమివ్వాలి అని త్వరపడుతున్నాడు. **"నాగచ్ఛత్యరవిందాక్షః నాహం వేద్మ్యత్ర కారణమ్"**- శ్రీకృష్ణుడు ఇంకా రాలేదే అని రుక్మిణి తపించిన శ్లోకాన్ని తలచి, అవతారశ్లోకంలోని పదాన్ని కూడా

**భావము :** **"న న"** అని అంటూ రెండు నిషేధాలను చేర్చి అనుసంధించే స్తోత్రరత్న శ్లోకరీతిని ఇందులో కవి అనుసరించారు. స్తోత్రరత్నంలోని **"శృణు విజ్ఞాపనమ్", "యాతు శతధా వినాశం తత్ సత్యం మధుమథన! విజ్ఞాపనమిదమ్"** అనేది అంతా కవి మనస్సులో మెదలుతున్నవి. అవి ఒక్కొక్కటి ఇక్కడ వ్యక్తమవుతున్నవి. నేను పాపం చేయలేదనే అసత్యాన్ని పలుకను. నిజంగానే ఈ విజ్ఞాపనను చేస్తున్నాను. దీనిని విని అనుగ్రహించు. స్తోత్రరత్నంలోని **"శతధా వినాశం యాతు"** అన్నది ఒక విధంగా ఇక్కడ **"అనీనశత్"** అనే రూపాన్ని పొందింది. **"న త్యజేయం కథంచన, దోషో యద్యపి తస్య స్యాత్"** అనే నీ అభయప్రదానం నా పాపభయాన్ని తీర్చింది. నేను నిర్భరుణ్ణి, నిర్భయుణ్ణి అయ్యాను.

**శ్లో॥ అపి శర్వపితామహాదిభిః**
**భజనీయః పురుషోత్తమో హి యః।**
**తముపాలభమానముద్ధతం**
**ధిగిమం మాం ధిగిమాం ధియం చ మే॥ 38**

**ప్రతిపదార్థము :** యః=ఎవడు, శర్వపితామహాదిభిః=ఈశ్వరుడు, బ్రహ్మ మొదలైనవారిచే, భజనీయః=ప్రీతితో ఆరాధించదగిన, పురుషోత్తమః హి=అందఱి పురుషులలోను ఉత్తముడైన పురుషుడో, తమ్=అతనిని, ఉద్ధతమ్=హెచ్చుతగ్గులుగా, (ఈరీతిలో), ఉపాలభమానమ్= దూషించి కోపించే, ఇమం మామ్=ఈ నన్ను, ధిక్=ఛీఛీ కొట్టాలి. ఇమాం చ మే ధియమ్=ఈ నా బుద్ధిని, ధిక్=కాల్చాలి.

**భావము :** **"న శక్యో న మాతుమపి శర్వపితామహాద్యైః"** అని ప్రారంభంలోను, **"విధిశివసనకాద్యైః ధ్యాతుమత్యంతదూరమ్"** అని మధ్యలో పల్కిన స్తోత్రరత్నాన్ని అనుసరిస్తూ, ఈ శ్లోకం రచింపబడడం సుస్పష్టం. శ్రీకృష్ణుని స్వరూపరూపగుణాలను పలు శ్లోకాలతో అనుభవించి, ఆ కృష్ణుని భజించి, నిత్యం భజించడానికి అనుకూలంగా తమ హృదయంలో సర్వదా అదే రీతిలో దర్శనాన్ని అనుగ్రహించాలి–అని ప్రార్థిస్తున్నాడు కవి. శ్రీకృష్ణుని ఆనందంగా భజనం చేసే పలు శ్లోకాలలో ఈ రీతిలో కృష్ణుని పరత్వాన్ని గూర్చి పల్కి, చివరలో కూడా 52వ శ్లోకంలో **"విధిశర్వముఖామరస్ఫురన్మకుటోన్నిద్రమణి ప్రభాకులమ్"** అని పాదాలలో శర్వ–పితామహుల కిరీటాలలోని రత్నాలు జ్వలించడాన్ని వర్ణించబోతున్నాడు. స్తోత్రరత్నంలో వలె ఉపక్రమోపసంహారాలలో ఈ విధంగా వర్ణించడం వల్ల ఇక్కడ కూడా ఉపక్రమోపసంహారాలలో అదే శబ్దాలను ఉపయోగించి పరదేవతా తత్త్వజ్ఞానంతో భజనాన్ని చేయాలి–అనే క్రమాన్ని వివరించాడు. **"పురుషోత్తమః కః"** అని స్తోత్రరత్నంలో ప్రశ్నరూపంగా పల్కిన దానిని ఇక్కడ ప్రసిద్ధంగా "ఎవడు పురుషోత్తముడో" అని మొదట పల్కి, సర్వస్మాత్ పరత్వాన్ని వివరించాడు. పూర్వం 11వ శ్లోకంలో కూడా పురుషోత్తమం పతిమ్" అని ప్రయోగించాడు. **"ధిగశుచిమవినీతం**



**వమతాం ఫణినాం విషానలం**
**కిము నానందయితాఽపి చందనః॥ 17**

**ప్రతిపదార్థము:** దయానిధే=కరుణాసముద్రా!, అయమ్=ఈ(నేను), నిర్గుణః= గుణహీనుడను, అత్యధమః అపి=చాలా చివరివాడను అయినా, భవతా=నీకు, దయనీయః=దయకు పాత్రుడను, విషానలమ్=విషాగ్నిని, వమతామ్=కక్కుతున్న, ఫణినాం అపి=సర్పాలకు కూడా, చందనః=చందనవృక్షం, న ఆనందయితా కిము=ఆనందాన్ని కల్గించదా ఏమి!

**భావము :** **"అమర్యాదః క్షుద్రః చలమతిరసూయాప్రసవభూః, కృతఘ్నో దుర్మానీ స్మరపరవశో వంచనపరః, నృశంసః పాపిష్ఠః"** (62) అని, **"నిహీనాచారోఽహం నృపశు రశుభస్యాస్పద మపి"** అని స్తోత్రరత్నంలో యామునులు పల్కినట్లు అత్యధముడని, నిర్గుణుడని కవి తన అపకర్షను వ్యక్తీకరిస్తున్నాడు. **"దయనీయస్తవ నాథ! దుర్లభః"** అని, **"మదృతే త్వం దయనీయవాన్న చ"** అని గల స్తోత్రరత్న ప్రయోగాలిచట నేపథ్యంలో మెదలుతున్నాయి. **"న తేఽనుకంప్యః"** అని ప్రారంభించి, **"తవానుకంప్యః"** అని చివరలో యామునులు స్తోత్రరత్నంలో దయనీయపర్యాయశబ్దాన్ని ప్రయోగించారు. ఇక్కడ 30వ శ్లోకంలో కూడ **"దయనీయః కృపణ ఏవ కేవలమ్"** అని ప్రయోగింపబడినది. సర్పంవలె నానోటి నుండి విషాన్ని కక్కితే మాత్రం ఏమి? నీవు హరించేవాడవు కదా! **"సుఖయతి నిజచ్ఛాయా దాయీ స్వయం హరిచందనః", "మోదేత సాధురపి వృశ్చికసర్పహత్యా"** అని అన్నాడు ప్రహ్లాదుడు. తేలును, పామును చంపితే సాధువుకూడా సంతోషిస్తాడు. ఆ దుష్ట సర్పానికికూడా చందనవృక్షం నీడనిచ్చి ఆశ్రయాన్ని ఇచ్చి ఆనందింపజేస్తుంది. **"యది వా రావణః స్వయమ్"** అని అన్నది. "హరిచందనవృక్షం" దండకారణ్యతపోవన పారిజాతం. **"కిము నానందయితా"–"ఏష హ్యేవానందయాతి"** అనే ఆనందమయ శ్రుతిని కవి దీనిలో స్మరింపజేస్తున్నాడు. ఆనందమయుడవైన నీ కరుణకు విషయం అయితే **"కిమహం పాప మకరవమ్"** (నేనేమి పాపాన్ని చేశాను) అని తపించనక్కఱలేదు. **"పాపిష్ఠః క్షత్రబంధుశ్చ"** అనే పౌరాణిక ప్రయోగాన్ని **"అత్యధమోఽపి"** అనే ప్రయోగం తలపిస్తున్నది.

**శ్లో॥ క్షుధితస్య న హి త్రపాస్తి మే**
**ప్రతిరథ్యం ప్రతిగృహ్ణతః కణాన్।**
**అకలంక! యశస్కరం న తే**
**భవదీయోఽపి యదన్యమృచ్ఛతి॥ 18**

**ప్రతిపదార్థము :** క్షుధితస్య=ఆకలిగొన్న, మే=నాకు, ప్రతిరథ్యమ్=ప్రతిదిక్కులోను, కణాన్= చిన్న అన్నకణాలను, ప్రతిగృహ్ణతః=యాచించడంలో, త్రపా=సిగ్గు, నాస్తి హి=లేదు అన్నది ప్రసిద్ధం. అకలంక=దోషం లేనివాడా! భవదీయః అపి=నీకు చెందినవాడను అయినా, అన్యమ్ ఋచ్ఛతి ఇతి యత్=నీకంటే అన్యుని వద్దకు పోయి యాచిస్తున్నాడు అన్నది ఏది ఉన్నదో, అది, న తే యశస్కరమ్=నీకు కీర్తిని కల్గించదు.

**భావము : "అభూతపూర్వం మమ భావి కిం వా సర్వం సహే మే సహజం హి, దుఃఖమ్, కింతు త్వదగ్రే శరణాగతానాం పరాభవో నాథ న తేఽనురూపః"** (25) అనే స్తోత్రరత్న శ్లోకానికి ఇది ప్రతిబింబం. ఆకలి బహుగుణీకృతమై, ప్రాణాపత్తు ఏర్పడేటపుడు అధముల ఇంటిలోకూడా అన్నాన్ని యాచించి, ప్రాణధారణను చేయడంలో తప్పులేదు. ఆకలి ఇత్యాది ఆపదలతో అలమటించే నేను కనబడిన దారిలో అంతటా తిరుగుతూ అసాధువుల గుమ్మాల వద్ద కూడా బిచ్చమెత్తుకొని, తిని బ్రతుకవచ్చు . ఆపత్సమయంలో అడ్డు లేదు. **"యం కంచిత్ పురుషాధమం కతిపయగ్రామేశ మల్పార్థదం సేవాయై మృగయామహే"** అధమ ప్రభువులను సేవించి నేను శోకించ తగినవాడనే! నాకది సహజమే. అందులో దోషం లేదు. నేను సిగ్గుపడనవసరం లేదు. **"అమలః"** అని నిష్కళంకజ్యోతిస్స్వరూపుడవు అయిన నీకే కదా ఇది అవద్యం. నీ ఆశ్రితుడనైన నాకు ఇతరుల దగ్గరకు పోవలసిన దుర్దశ వచ్చినదే! అనే దోషం నీకు అంటుకుంటుంది సుమా! అది నీకు యశస్కరం కానేకాదు. ఆలోచించు.

**శ్లో॥ నితరాం నరకేఽపి సీదతః**
**కిము హీనం గలితత్రపస్య మే।**
**భగవన్ కురు సూక్ష్మమీక్షణం**
**పరతస్త్వాం జనతా కిమాలపేత్॥ 19**

**ప్రతిపదార్థము :** నరకే=నరకంలో, నితరాం సీదతః అపి=చాలా ఎక్కువగా బాధపడినా, గళితత్రపస్య మే=సిగ్గులేనివాడనైన నాకు, కిము హీనమ్=అంతకంటే ఏమి కొఱత కల్గుతుంది? భగవన్=షాడ్గుణ్యపరిపూర్ణా!, సూక్ష్మమ్ ఈక్షణమ్=కొంచెం సూక్ష్మమైన దృష్టిని, కురు=ప్రసరింపజేసి, చూడు, పరతః=బయట, త్వామ్=నిన్ను, జనతా=జన సమూహం, కిమ్ ఆలపేత్=ఏమని అంటుంది?

**భావము :** క్రూరనరకలోకాలలోనికి నన్ను పడదోసి దుఃఖించేటట్లు చేస్తే నీకు ఏమి ఫలం? సిగ్గు అన్నది పూర్తిగా నన్ను వదలి పెట్టిపోయింది. అందువల్ల, వాటివల్ల నాకేమి అవమానం కొత్తగా కలుగబోతుంది? క్రొత్తగా ఏమి లజ్జ కలుగుతుంది! **"సహజం హి దుఃఖమ్"** అన్నట్లు నాకు నరకవాసం, అక్కడి దుఃఖం సహజమే. నా సహజస్థితికి నూతనంగా ఏమి కొఱత కలుగబోతుంది! భగవాన్! నీకున్న షాడ్గుణ్యంలో మొదటిగుణం జ్ఞానమే కదా! కన్నులను, చెవులను నీవు మూసికోలేవు. **"దిశః శ్రోత్రమ్"**–దిక్కులు చెవులు. అంతటా వ్యాపించిన దిక్కులే నీ కర్ణాలు. నీవు కూడా అంతటా వ్యాపించి ఉన్నావు. **"సహస్రాక్షి"** –అని నీకు పలు వేల కన్నులు. సర్వసాక్షులుగా చెప్పబడే సూర్యచంద్రులు నీ నేత్రాలు; నిన్నుగూర్చి జనసమూహం ఏమని అనుకుంటారు? అనే విషయాన్ని నీవు కొంచెం గమనించాలి. ఆశ్రితులను చేయి విడిచినవాడవు నీవు– అని కదా దోషారోపణాన్ని చేస్తారు. **"పురతః"** అనే దానికి వ్యతిరేకపదం **"పరతః"** అన్నది.



అల్పమని అర్థం. దయనీయత్వాన్ని ఇది సూచిస్తుంది. **"అనుకంపాయామ్" "క్రుధం న కల్పయతు"**–అనే ప్రయోగస్వారస్యం గమనించతగినది. నీకు కోపం అనేది నిజానికి రాదు. కోపాన్ని నీవు కల్పించుకోవడమే, భావన చేయటమే, నటించడమే. ఆ కల్పనకూడా అక్కరలేదు. కుపితుడు, ఆతురుడు, బాలుడు–అనే వీటిలో ఏ ఒక్కటి అయినా చాలు. నాలో ఈ మూడు చేరి ఉన్నాయి.

**శ్లో॥ భుజగాహితకల్పితధ్వజ!**
**స్ఫురదాశాభుజగాలివేల్లితమ్।**
**జటిలజ్వరకుంజరాంకుశ!**
**జ్వరజుష్టం న జహీహి జాతుమామ్॥ 36**

**ప్రతిపదార్థము :** భుజగాహితకల్పితధ్వజ!=నీకు పడుక అయిన ఆదిశేషుడనే సర్పానికి విరోధి అయిన గరుడుని ధ్వజంగా కలవాడా! స్ఫురదాశాభుజగాలివేల్లితమ్=ప్రతిక్షణం చంచలాలైన ఆశలనే సర్పాలచేత చుట్టుముట్టబడి భయపడేవాడను, జటిలజ్వరకుంజరాం కుశ=జటిలమైన జ్వరం అనే ఏనుగును అణచే అంకుశంవంటివాడా!, జ్వరజుష్టం =జ్వరంతో కూడిన, మామ్=నన్ను, న జాతు జహీహి=ఎప్పటికీ విడువకుసుమా!

**భావము :** 39వ శ్లోకంలో శ్రీకృష్ణుని వర్ణించబోతున్నారు. స్తోత్రరత్నంలోని **"కదా పునః శంఖరథాంగ కల్పక ధ్వజారవిందాంకుశ"** అనే 31వ శ్లోకం నుండి, **"అచింత్యదివ్యాద్భుత"** అనే 35వ శ్లోకంవరకు భగవానుని వర్ణించేటట్లే, ఆ వర్ణనలోని **"ధ్వజాంకుశ" "స్ఫురత్", "అనంతభోగి"** (ఆదిశేషుడు, ధ్వజం అయిన గరుత్మంతుడు) మొదలైనవి అన్నీ ఇక్కడ కూడా ప్రయుక్తాలు. భుజగాలకు గరుడుడు విరోధి. గరుడధ్వజుడవైన నీకు ఆశల సర్పాలు చుట్టిన నన్ను ఆ సర్పాల నుండి కాపాడడం ఒక శ్రమా! సహజ విరోధి అయిన గరుడుడు, సర్పం విరోధాన్ని విడిచే శాంతిసముద్రుడవైన యోగీశ్వరుడవు కదా నీవు! నా దగ్గర ఉండే ఆశావిషం అయిన ఆశాసర్పాలను అణచి, శమనం చేయడంలో సమర్థుడవు కదా నీవు!" **"శాంతిసమృద్ధమ్"** అనికదా నిన్ను మాండూక్యోపనిషత్ స్తుతించింది.

**శ్లో॥ న వదామి న దుష్కృతం మయా**
**కృతమిత్యుక్తిమిమాం తు మే శృణు।**
**మమ భీతిమనీనశద్ విభో!**
**పతితోద్ధారకనామ తావకమ్॥ 37**

**ప్రతిపదార్థము :** మయా=నాచే, దుష్కృతం=చెడ్డకార్యం, న కృతమ్ ఇతి=చేయబడలేదు అని, న వదామి=నేను అనను, మే=నాయొక్క, ఇమాం ఉక్తిం తు=ఈ మాటను మాత్రం, శృణు=విను, విభో!=స్వామీ!, తావకమ్=నీకు చెందిన, పతితోద్ధారకనామ=పతితులను ఉద్ధరించేవాడవు అనే పేరు, మమ భీతిమ్=నా భయాన్ని, అనీనశత్=ఉపశమింపజేసింది.

ఇక్కడ కవి మదిలో స్ఫురిస్తున్నది. **"జగదీశ!"** అని అనడం ద్వారా ఆ శ్లోకార్థం వ్యంజితం. ఈశేశితవ్య సంబంధానికి తగిన న్యాయాన్ని నీవు పాలించాలి. ఎంతమాత్రం విడవకూడదు. **"మాస్మజీహపః"** అనేదాన్ని అనుసరించి **"న హి జహ్యా జగదీశ! జాతు"** అని ప్రయోగింపబడింది. **"న జాతు హీయతే"** అనే స్తోత్రరత్న సూక్త్యర్థం కూడా ప్రకృతంలో మదిలో భావ్యం. **"న జాతు మాతుశ్చరణౌ జిహాసతి"**– తెలియని వాడనైన నేను నిన్ను వదలాలని చూచినా, సంబంధాన్ని తెలిసిన నీవు నన్ను విడువకూడదు. నీవు అఖిల హేయప్రత్యనీకుడవు. నిన్ను దరిచేరినవారి పాపాలను తీర్చటమే నీ స్వభావం. నీవు అప్రతిభటరక్షకుడవు. నీ రక్షణలో కొఱత ఉండకూడదు. నేను ఏ తప్పు చేస్తే ఏమి! నా దగ్గర ఉండే దోషాలను ప్రతిభటం అయిన గుణాలు నీదగ్గర ఉన్నవి కదా! నా దుర్దశ మిక్కిలి క్రూరమైనదే! దానిని పోగొట్టే కరుణాకరుడవుకదా నీవు. నేను పాపాలన్నీ గూడుకట్టుకొన్నవాడనై ఉంటే మాత్రం ఏమి? నీవు పతితులైన పాపిష్ఠివారికికూడా ఆశ్రయణీయుడవు కదా! **"పంజరమ్"**– అని అన్నందున పాపాలన్నీ నన్ను విడిచి బయటకు పోకుండా నా దగ్గరే గూడుకట్టుకొన్నవి. గూటిలో చేరిన చిలుకలవలె కొంచెం సేపు బయటకు పోయినా వెంటనే తిరిగి తనవద్దకే తిరిగి చేరుతున్నాయనే స్వారస్యం ధ్వనిస్తుంది. చిలుకను బయటకు విడువడంకూడా అది బయటకు పోయిన కొంచెంసేపు సంచరించడం కోసమే. తన పాపాలు బయట సంచరించటం కోసమే కొంచెం సేపే బయటకు విడువడం. చిలుకలను పెంచినట్లు నేను పాపాలను అల్లారుముద్దుగా పెంచుతున్నాను. నాకు పాపవిషజ్వరం తలకు ఎక్కితే మాత్రం ఏమి! నీవు నా జ్వరాన్ని శమింపజేసే అమృత సముద్రుడవు కదా! నీవు సమస్తకల్యాణగుణామృతోదధివి. **"న జహీహి జాతు మామ్"** అని 36వ శ్లోకంలోకూడా కవి అన్నాడు **"జహిహి జహీహి జహాహి"**– అని భట్టి ప్రయోగం.

**శ్లో॥ కటుజల్పనమల్పకస్య మే**
**న హి తే కల్పయతు క్రుధం విభో!**
**కుపితాతురబాలభాషితం**
**కిము (నహి) గృహ్ణంతి మనాఙ్మహాశయాః॥ 35**

**ప్రతిపదార్థము :** విభో=ప్రభూ!, అల్పకస్య మే=చాలా అల్పుడను అయిన నాయొక్క, కటు జల్పనమ్=కటుభాషణం, తే=నీకు, క్రుధమ్=కోపాన్ని, న హి కల్పయతు=కల్గించనే కల్గించవద్దు, మహాశయాః=గంభీరమైన మనస్సును కలవారు, కుపిత+ఆతురబాలభాషితమ్ =కోపించినవారు, జ్వరం మొదలైన వ్యాధులచే పీడితులు, బాలురు–అనే వీరి మాటను, మనాక్=కొంచెంకూడా, గృహ్ణంతి కిము=మనస్సులో గ్రహిస్తారా ఏమి! (నహి గృహ్ణంతి= గ్రహించరు కదా!)

**భావము : "అల్పకస్య మే"**– అల్పునికంటే అల్పుణ్ణి నేను. ఇక్కడ **"క"** అనే ప్రత్యయానికి



**శ్లో॥ నరకే నిజకర్మకల్పితా**
**భజతో మే మహతీరపి వ్యథాః।**
**ఇదమేకమసహ్యమీక్షకా**
**యదనాథం నిగదంతి మాం విభో॥ 20**

**ప్రతిపదార్థము :** నరకే=నరకంలో, నిజకర్మకల్పితాః=నేను చేసిన కర్మల చేత కల్పించబడ్డ, మహతీః వ్యథాః=మిక్కిలి క్రూరబాధలకు, భజతః అపి మే=నిరంతరం అనుభవించే నాకు కూడా, ఇదమ్ ఏకమ్=ఇది ఒక్కటి మాత్రం, అసహ్యమ్=సహించరానిదిగా ఉన్నది. (అది ఏది? అని అంటే, విభో=ప్రభూ!, ఈక్షకాః=చూచేవారు, మామ్=నన్ను, అనాథమ్=దిక్కు లేని వాడనని, నిగదంతి యత్=అంటున్నారు–అన్నదే.

**భావము :** "నీకంటే వేఱొక రక్షకుని కల్గినవాడను కాను" "తదహం త్వద్‌ృతేన నాథవాన్" అని యామునుల సూక్తి. నీవు కూడా నన్ను గెంటివేస్తే ఇక నేను అనాథుడను అవుతాను కదా! నాకు ప్రభువైన నీవు ఉండగానే, నన్ను అనాథుడను అని చూచేవారు అంతా పల్కితే, నిన్ను అవమానించినట్లే కదా! అవుతుంది. **"ఈక్షకాః"**–అనే పదానికి "పరీక్షితులైన పెద్దలు" అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. వివేకులైన పెద్దలు నిన్ను ఆశ్రయించిన నేను క్రూర నరకాలలో పడే బాధలను చూచి, "ఇతడు అనాథుడుగా రక్షకులెవ్వరూ లేకుండా బాధపడుతున్నాడే!" అని అంటారు. "నేను అనాథుడను" అని అంటే "నాకు ప్రభువైన నీవు లేవు; నీవు అసత్తువు" అని అన్నట్లే అవుతుంది. "సత్" అని, "ఒకటే సత్తు" అని వేదాలు ఉద్ఘోషించే నిన్ను పెద్దలు "నీవు లేవు, నీవు అసత్" అని అంటే, అంతకంటే బాధాకరమైనది నాకు ఇంకొకటి ఉన్నదా? **"అవజానంతి మాం మూఢాః"** అని గీతలో నీవు పలికావు. మూఢుల అవమతిని నీవు లెక్కించవలసిన పని లేదు. విజ్ఞుల అవమతిని గమనించకుండా ఉండవచ్చునా! ఆ అవమానానికి గల కారణాన్ని వెంటనే లేకుండా చేయాలి. నన్ను వారు **"సనాథుడు", "నాథవాన్"** అని అనేటట్లు నీవు వెంటనే చేయాలి. **"నిగదంతి"**–అనే క్రియ వేదాలు తెలుపుతున్నవి అనే అర్థాన్ని ఇస్తుంది. "పల్కిన దంతా వేదం" అని అన్నట్లు పెద్దల సూక్తులు వేదాలవంటివి అని స్వారస్యం. **"క్రీడార్థ మపి యద్బ్రూయుః"** అన్నట్లు వారి పరిహాస వచనాలు సైతం ప్రామాణికవచనాలవలె ఆదరించ తగినవి. "నేను నరకాలలో అనుభవించే బాధలన్నీ నాకు సహ్యాలే. నా నాథుడు విభుడై, అవ్యయుడై, అంతటా వ్యాపించి ఉండేవాడై ఉండగా, అతడు లేడు అని అర్థం వచ్చేటట్లుగా నన్ను అనాథుడనని ఇతరులు పలికేమాట నాకు చాలా అసహ్యంగా ఉన్నది– అని కవి తాత్పర్యం. నేను అనుభవించే నరకాలు నేను సంపాదించినవి. అవి నా ఆర్జితాలు. నా సృష్టి. లోకం నీ సృష్టి. **"వ్యథాః భజతః"**–క్రూర దుఃఖాలను నిరంతరం భజిస్తున్నాను. నిన్ను భజించడం లేదా– అని ఇచటి స్వారస్యం. **"విభో"**– అంతటా నిత్యంగా ఉండే నిన్ను "లేవు" అని తిరస్కరించేటట్లు, మఱుగుపఱచేటట్లు లోకులు అంటున్నారే! అదే నా బాధ.

**శ్లో॥ మృగదంతిముఖాన్ మయా సహ**
**ప్రతిరుద్ధాన్ భవజాలబంధనే।**
**తవ మా మపహాయ ముంచతః**
**కరుణా కిం న భినత్తి మానసమ్॥ 21**

**ప్రతిపదార్థము :** మయా సహ=నాతోపాటు, ప్రతిరుద్ధాన్=చెఱలో పెట్టబడ్డ, మృగదంతి ముఖాన్=మృగాలైన ఏనుగులు మొదలైనవానిని, భవజాలబంధనే=సంసారం అనే వలల బంధనుండి, మాం అపహాయ=నన్ను ఒక్కని మాత్రం తప్పించి, మిగిలిన వాటిని అన్నిటినీ, ముంచతః=విడిపించే, తవ=నీయొక్క, మానసమ్=మనస్సును, కరుణా=దయ, కిం న భినత్తి=ఎందుకోసం బ్రద్దలు చేయడంలేదు?

**భావము :** ఈ సంసారమనే వలల బంధనాలలో నాతోపాటు ఏనుగులు (గజేంద్రుడు) మొదలైన మృగాలుకూడా బంధింపబడ్డాయి. ఏనుగును (గజేంద్రుని) నీవు ఆ బంధాల నుండి విడిపించావు. **"పశుః మనుష్యః పక్షీ వా యే చ వైష్ణవసంశ్రయాః"** అనే రీతిలో ఎన్నో మృగాలు, పశువులు లౌకికాలైన వలల బంధాలనుండి విడివడి ముక్తిని పొందాయి. పశువులకు పక్షులకు మధ్య ఉన్న నన్ను మాత్రం ముక్తిని కల్గించకుండా విడచివేశావు. "నీ మనస్సు కరుణతో కొంచెంకూడా కఱగడం లేదా? **"మాతంగమానుషభిదా న విశేషహేతుః" "సమోఽహం సర్వభూతేషు"** అన్నవాడవు ఏనుగు అని, మనుష్యుడు అనే తేడాను చూడవచ్చునా? అన్ని ప్రాణులకు నేను సమానుడను-అని కదా నీ గీత సూక్తి.

**శ్లో॥ నిరుపాధిజనార్తిహారిణం**
**భగవన్! త్వామవగత్య తత్త్వతః।**
**కృతపుణ్యచయావహేళనం**
**కథమబ్జేక్షణ! మాముపేక్షసే॥ 22**

**ప్రతిపదార్థము :** అబ్జేక్షణ=తామరసనేత్రా!, భగవన్=భగవన్! నిరుపాధిజనార్తిహారిణమ్=ఏ ప్రయోజనాన్ని (హేతువును) అపేక్షించకుండా నీవుగానే జనుల ఆర్తిని తీరుస్తావు అని, త్వామ్=నిన్ను, తత్త్వతః=యథార్థంగా, అవగత్య=తెలిసికొని, కృతపుణ్యచయావహేళనమ్= పుణ్యసమూహాలను అవమానించిన, మామ్=నన్ను, కథం ఉపేక్షసే=ఏ విధంగా ఉపేక్షిస్తున్నావు?

**భావము : "పుణ్యస్య ఫలమిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవాః"**- పుణ్యఫలం కావాలని కోరుకుంటున్నారు. కాని, పుణ్యాన్ని ఆచరించడానికి ఇష్టపడడం లేదు. ఏమి? నీవు సుకృతాన్ని ఎందుకు చేయకూడదు? కొంచెం సుకృతం చేసి ఉంటే, తన్మూలంగా నీ విషయంలో కృపను చేసి ఉండవచ్చునే!- అని తలుస్తున్నావా! అని భగవానుని అభిప్రాయంగా భావించిన కవి ఆ తత్త్వజ్ఞానమే కదా నన్ను పుణ్యపాపాలను వెదకకుండా



**ప్రతిపదార్థము :** భగవన్=ఓ భగవాన్! అహమ్ ఏవ=నేనే, దోషదూషితః=దోషాలతో దుష్టుడనై, త్వామ్=షాడ్గుణ్యపరిపూర్ణుడవైన, ఏ దోషంలేని భగవానుడవైన నిన్ను, ముధా=వ్యర్థంగా అకారణంగా, సముపాలభే=బలంగా దోషారోపణను చేసి, దూషిస్తున్నాను, రమణీవిరహజ్వరజ్వలన్=తన కాంతయొక్క విరహంచేత కల్గిన మదనజ్వరంతో తపించే, కుమతిః=మతిహీనుడు, అమృతాంశుమ్=అమృతకిరణాలను కల చంద్రుని, వినిందతి =మిక్కిలిగా తిడుతున్నాడు.

**భావము :** "ఓయీ! నన్ను **"భగవన్"** అని సంబోధించావే! **"భగవన్! కుకర్మభిః"** అని అన్నావే! భగవచ్ఛబ్దార్థం నీకు తెలియదా! **"వినా హేయైర్గుణాదిభిః"**-అన్నట్లు చెడ్డగుణం ఏమీ లేని నిర్దుష్టమైనవాడే కదా భగవానుడు. ఈ విషయాన్ని చక్కగా తెలిసినా నీవు నన్ను ఈ విధంగా బహుధా దూషించవచ్చునా!" - అని భగవానుడు ప్రశ్నిస్తున్నట్లు తలచి కవి ఇందులో ప్రత్యుత్తరం పల్కుతున్నాడు.

నీవు ఏ దోషం లేనివాడవు, సమస్తకల్యాణగుణోదధి అయిన భగవానుడవు. **"భగవన్"** అని ఈ శ్లోకంలో కూడా మళ్ళీ సంబోధించడంద్వారా, భగవచ్ఛబ్దార్థాన్ని స్థిరీకరిస్తున్నాడు కవి. "నిర్దుష్టుడనైన నన్ను ఎందుకు దూషిస్తున్నావు" అని అడిగావు కదా! నేను దోషదూషితుడను కావడమే దానికి హేతువు. నా క్రూరకర్మల ఫలంగా నాకు సన్నిపాతజ్వరం వచ్చింది. బుద్ధి చెడింది. ఏ దోషం లేని నిన్ను నా కారణాలకు హేతుభూతుడవని లేని కారణాన్ని నీతలపై పెట్టి, నిన్ను దూషించాను. ఇది ఎటువంటిది? అని అంటే, తన ప్రియకాంత విరహంచేత తాపం కల్గి, విరహజ్వరం పట్టిన కాముకుడు అమృతకిరణాలతో కూడిన పూర్ణచంద్రుని బహుధా దూషిస్తాడు. **"శీతరశ్మిత్వమిందోః"**- చంద్రుడు చల్లని కిరణాలను కల్గినవాడని అనడం అయథార్థం-అని అన్నాడొక కవి.

**శ్లో॥ కరుణాకర! దుర్దశాకులం**
**పతితాలంబన! పాపపంజరమ్!**
**అమృతాంబునిధే! మహాజ్వరం**
**న హి జహ్యా జగదీశ! జాతు మామ్॥ 34**

**ప్రతిపదార్థము :** కరుణాకర=కరుణకు నిలయమా!, దుర్దశాకులమ్=కఠినమైన ఆపదచే బాధపడే, మామ్=నన్ను, పతితాలంబన=పతితులకు గతియైనవాడా!, పాపపంజరమ్= పాపాలనే గూడులో ఉన్న నన్ను, అమృతాంబునిధే=అమృతసముద్రమా!, మహాజ్వరమ్=తీవ్ర తాపజ్వరంతో తపించే నన్ను, జగదీశ=లోకానికి ప్రభువైన స్వామీ!, జాతు=ఏనాడూ, న హి జహ్యాః=ఎంతమాత్రం విడువవద్దు.

**భావము : "తదహం త్వదృతే న నాథవాన్ మదృతే త్వం దయనీయవాన్ న చ, విధినిర్మిత- మేతదన్వయం భగవన్! పాలయ మా స్మ జీహపః"** (51) అనే స్తోత్రరత్నశ్లోకభావం

**భావము : "ఉపకారిషు యస్సాధుః సాధుత్వే తస్య కో గుణః, అపకారిషు యః సాధుః స సాధుః సద్భిరుచ్యతే"** అని సుభాషితం. ఉపకారం చేసేవారిపట్ల సాధువులై ఉండడంలో ఏమి గొప్ప! అపకారుల విషయంలో కూడా ఎవరు సాధువులై ఉంటారో, వారే సాధువులని సత్పురుషులు పొగడుతారు. **"మాదృశి"**– నీ దయకు నేను అనుత్తమం– ఉత్కృష్టం అయిన పాత్రం. నేను **"నిఖిలాగసాం పదమ్"** అయితే ఏమి? నీ క్షమకు ఏమి దోషం ఉన్నది? ఏమి కొఱత ఉన్నది? చెప్పు. **"వద కిమపదమాగస్తస్య తేఽస్తి క్షమాయాః"** అని యామునులు ప్రశ్నించినట్లు "వద" అని అంటూ కవి అంటున్నాడు. **"భవదీయ!"** అనే ప్రకృతప్రయోగానికి –**"త్వదీయస్త్వద్భృత్యస్తవ పరిచనస్త్వద్గతిరహమ్"**–అని భావం.

**శ్లో॥ అయి శైశవలాలితః శిశుః**
**ప్రతిబుద్ధో జనకేన తాడ్యతే।**
**న కదాపి చ లాలితస్త్వయా**
**కిము తాడ్యో భగవన్! కుకర్మభిః॥ 32**

**ప్రతిపదార్థము :** అయి=స్వామీ!, శైశవలాలితః=చిన్నతనంలో గారాబంగా (తండ్రిచే) ఆదరించి, పెంచబడ్డ, శిశుః=కుఱ్ఱవాడు, ప్రతిబుద్ధః=జ్ఞానం కల్గిన వయస్సు వచ్చిన తరువాత, జనకేన=(అ) తండ్రిచేతనే, తాడ్యతే=(తప్పు చేసినపుడు) దండింపబడుతున్నాడు, త్వయా=నీచే, కదాపి=ఏ సమయంలోను, న లాలితః=నేను లాలింపబడలేదు, భగవన్= భగవన్, కుకర్మభిః=దుష్కృత్యాలతో, తాడ్యః కిము?=నేను దండింపబడతగినవాడనా!

**భావము : "పితా త్వమ్"** ఇత్యాది స్తోత్రరత్నశ్లోకం కవి మనస్సులో మెదలుతున్నది. నీవు నాకు తండ్రివి అవునా? కాదా? కాదని నీవు అనలేవు. **"పితాహమస్య జగతః"** అని గీతలో నీవే పలికావు. నీ గీతాగానం లోకం అంతా వ్యాప్తమైనది. తండ్రి అయినవాడు తన బిడ్డలను దండిస్తాడా! వయస్సు వచ్చి, జ్ఞానం కలిగిన తరువాత బిడ్డలు చేసే తప్పులకు తండ్రి వారిని దండిస్తాడని అంటావా? అయితే, ఆ తండ్రి తన బిడ్డలను వారి చిన్నతనంలో గారాబంగా, ముద్దుగా పెంచినవాడై ఉంటాడుకదా! ఆ రీతిలో ఏనాడైనా నన్ను నీవు గారాబంగా ముద్దుచేసి లాలించావా? స్వల్పకాలం అయినా నీవు నన్ను ముద్దుచేసి, పెంచివుంటే, ఆ క్షణంలోనే నా సంసారబంధం తొలగిపోయి ఉండేదికదా! ఏనాడూ నన్ను లాలించని తండ్రివి అయిన నీవు నీ పుత్రుడను అయిన నన్ను తప్పులు చేసినందులకు ఏ విధంగా దండించగలవు? ఒకసారి బాగా ఆలోచించు.

**శ్లో॥ అహమేవ హి దోషదూషితో**
**భగవంస్త్వాం సముపాలభే ముధా!**
**రమణీవిరహజ్వరజ్వల–**
**న్నమృతాంశుం కుమతిర్వినిందతి॥ 33**



వాటిని అనాదరించేటట్లు చేసింది–అని అంటున్నారు. ఏది ఆ తత్త్వజ్ఞానం!–నీవు అవ్యాజ బంధువువు, స్వాభావిక కృపావాన్, అకారణసుహృత్తు–అని నీ విషయంలోని తత్త్వజ్ఞానమే నన్ను పుణ్యాన్ని చేసే విషయంలో అనాదరించేటట్లు చేసింది. ఇటువంటి తత్త్వజ్ఞానం వల్ల పుణ్యాచరణాన్ని మఱచిన నాపై జాలి చూపవద్దా! నేను పుణ్యం చేయలేదని నన్ను పక్కకు గెంటివేయవచ్చునా! **"అబ్జేక్షణ"**–స్వాభావికం అయిన దయచేత ఎల్లప్పుడు చల్లని, ఎఱ్ఱని రేఖలను కొనలలో కల్గిన, వికసించిన పద్మాలవంటి నేత్రాలను కలవాడా! అని భావం. **"కృతపుణ్యరస"** అని పాఠాంతరం.

**శ్లో॥ సతతం నిగమేషు శృణ్వతా**
**వరద! త్వాం పతితానుపావనమ్।**
**పురు పాపముపాస్యతేఽనిశం**
**త్వయి విశ్వాసధియా మయా విభో॥ 23**

**ప్రతిపదార్థము :** వరద=ఏ వరాన్ని అయినా ఇచ్చేవాడా!, విభో=ప్రభూ!, నిగమేషు= వేదాలలో, త్వామ్=నిన్ను, పతితానుపావనమ్=పతితులైన పాపిష్ఠివారిని పావనం చేస్తానని, సతతమ్=నిరంతరం, శృణ్వతా=వింటున్న, మయా=నాచే, త్వయి=నీ విషయంలో, (నీ స్వభావంలో, నీ పతితపావన శక్తిలో), విశ్వాసధియా=నమ్మకంతో, అనిశమ్=ఎల్లప్పుడు, రాత్రి పగలు, పురు పాపమ్=మిక్కిలి పాపం, ఉపాస్యతే=మిక్కిలి ఆదరంతో ఆశ్రయింప బడుతున్నది.

**భావము :** నీ పుణ్యసంపదను అన్వేషించకపోవడాన్ని గూర్చి వదలిపెట్టు. నీవు అధికంగా పాపాలను చేయకుండా అయినా ఉండవచ్చునుకదా!" అని అంటున్నావా, అందుకు కూడా నాకు నీ విషయంలో ఉండే మహా విశ్వాసమే కారణం సుమా! అని కవి ఇందులో చమత్కరిస్తున్నాడు. నిరంతరం నా చెవులకు ఉపనిషత్ సూక్తులు వినబడతాయి. నీతో స్నేహాన్ని కల్గిఉండి, నీపట్ల మా ఆత్మకలసి ఉన్నట్లయితే మా పాపాలు అన్నీ అగ్నిలో దూది పింజలవలె రూపుమాసి పోతాయి–అని ఛాందోగ్యోపనిషత్తు తెలుపుతున్నది. **"సర్వే హాస్య పాప్మానః ప్రదూయంతే"**. ఆ రీతిలోనే మిగిలిన ఉపనిషత్తులుకూడా పల్కుతున్నవి. **"కిమహం పాపమకరవమ్"** అయ్యో, నేను ఏమి పాపం చేశాను–అనే అనుతాపం నిన్ను ఉపాసించి, దరి చేరినవారికి ఉండదు–అని తైత్తిరీయోపనిషత్తు అంటున్నది. **"పవిత్రాణాం పవిత్రం యః", "పావనః సర్వలోకానాం త్వమేవ రఘునందన"** అనే మహర్షుల వచనాలనుబట్టి నీ పవిత్రతను నమ్మాను. "శుద్ధిని కల్గించే వస్తువులకు శుద్ధిని కల్గించే వాడెవడో అతడు" అని భీష్ముడు సహస్రనామ స్తోత్రారంభంలో అన్నాడు. ఓ రాఘవా! లోకాలను అన్నింటిని పవిత్రం చేసేవాడవు నీవే" అని అన్నది శబరి. శ్లోకంలోని **"నిగమేషు"** అనే పదం నిగమసంమిత సూనృతోక్తులైన శ్రీరామాయణాదులను కూడా తెలుపుతుంది. **"పురు పాపం ఉపాస్యతే మయా"** – నీవు నాచే ఉపాసింపబడడం లేదు. నిన్ను **"విగ్రహవాన్**

ధర్మః", ధర్మం సనాతనమ్" అని ధర్మమూర్తివని అంటున్నారు. నీ ధర్మ స్వరూపానికి సాక్షాత్తు వ్యతిరేకం అయిన అధర్మాన్నే నేను నిరంతరం ఉపాసించానే! అయ్యో! అని కవి వాపోతున్నాడు. **"పతితోద్ధారకు"**డవనే నీ నామం నేను పాపం చేయరాదనే భయాన్ని తీర్చింది-అని రాబోయే 37వ శ్లోకంలో పలుకబోతున్నాడు కవి. శ్రుతుల సతతశ్రవణంచేత ఇది సిద్ధించింది- అని కవి చమత్కరిస్తున్నాడు.

**శ్లో॥ సుకృతం న కృతం పురా కదా-**
**పృథ సర్వం కృతమేవ దుష్కృతమ్।**
**అధునా గలితహ్రియా మయా**
**భగవంస్త్వాం ప్రతి కిం నిగద్యతామ్॥ 24**

**ప్రతిపదార్థము :** మయా=నాచేత, పురా=దీనికిముందు, కదాపి=ఏ సమయంలోను, సుకృతమ్=పుణ్యం, న కృతమ్=చేయబడలేదు, అథ=మఱియు, సర్వం దుష్కృతమ్=సకల పాపాలు, కృతమేవ=చేయబడిందే అయింది, అధునా=ఇపుడు, గళితహ్రియా=సిగ్గుజారిన, మయా=నాచే, భగవన్=స్వామీ!, త్వాం ప్రతి=నీ విషయంలో, కిం నిగద్యతామ్=ఏమని అనబడవచ్చు?

**భావము : "న నిందితం కర్మ"** అనే స్తోత్రరత్నంలోని 23వ శ్లోకం దానికి ముందున్న **"న ధర్మనిష్ఠోఽస్మి"** అనే పద్యం ఇందులో 21, 22, 23వ శ్లోకాలుగా రూపొందాయి. 22వ శ్లోకంలో చేసిన పుణ్యం ఏదీ లేదని అనిన కవి, 23వ శ్లోకంలో క్రూరపాపాలను సందేహించకుండా చేశానని అన్నాడు. ఈ రెండిటినిచేర్చి 24వ శ్లోకంలో ప్రస్తావిస్తున్నాడు. తనకు మార్గదర్శి అయిన మూలగ్రంథంలోని 22, 23 శ్లోకాలను అదే సంఖ్యలో అంటే 22,23 శ్లోకాలుగా కవి రచించడం ఇంకొక గమనించ తగిన విషయం. "అనుకూల కృత్యాలు లేవని గర్హించనక్కఱలేదు. ఉన్న యోగ్యతను నశింపజేయగల్గే నిషిద్ధానుష్ఠానాలు చేయకపోతే మంచిని కల్పించి, పురుషార్థాన్ని ఇస్తాను" అని భగవదభిప్రాయంగా భావించిన కవి అందులకు సమాధానంగా "ప్రతికూల కార్యాలతో నేను పూర్ణుణ్ణి సుమా" అని అంటున్నారు-అని శ్రీయామునుల స్తోత్రరత్నంలోని 23వ శ్లోకానికి వ్యాఖ్యాత రచించిన అవతారిక. ఇక్కడ కూడా 23వ శ్లోకానికి ఈ అవతారిక పొసగుతుంది. **"న, న"** అనే రెండు నఞ్‌లను ప్రయోగించి, "ఒక్కటి కూడా కొఱత లేదు. అన్ని పాపాలు చేయబడ్డాయి" -అని స్తోత్రరత్న శ్లోకంలోని **"న నిందితం కర్మ తదస్తి లోకే సహస్రశోఽయం న మయా వ్యధాయి"** అనే ప్రయోగం వివరించబడింది. ఇక్కడ కూడా **"సర్వ మపి దుష్కృతం కృత మేవ"** అని పదప్రయోగసందర్భం. స్తోత్రరత్నశ్లోకంలో **-"సోఽహం విపాకావసరే ముకుంద! క్రందామి సంప్రత్యగతి స్తవాగ్రే"**- ఇపుడు పాపాలన్నీ కష్టాలుగా పరిణమించే సమయంలో నీ ముందు వేఱు గతి లేనివాడనై రోదిస్తున్నాను" అని చెప్పబడింది.



**శ్లో॥ పతితోఽప్యతిదూరతోఽపి స-**
**న్నకృతజ్ఞో నిఖిలాగసాం పదమ్।**
**భవదీయ ఇతీరయంస్త్వయా**
**దయనీయస్త్రపయైవ కేవలమ్॥ 30**

**ప్రతిపదార్థము :** అపి=పతితుణ్ణి అయినా, అకృతజ్ఞః=చేసిన మేలును మఱచిపోయే కృతఘ్నుణ్ణి అయినా, నిఖిలాగసాం పదం అపి=అన్ని విధాలైన దోషాలకు స్థానం అయినా, అతిదూరతః=చాలా ఆపద్దశలో ఉన్నవాడను అయిన నేను, భవదీయః ఇతి=నీకు చెందిన వాడను అనే, ఈరయన్=పల్కును పల్కుతున్న వాడననే కారణాన్నిబట్టి, త్వయా=నీచేత, కేవలం త్రపయైవ=చిక్కుకొంటున్నాను అనే కారణం చేతనే, దయనీయః=జాలి చూపించదగినవాడను. (**"కృపయైవ"** అనే పాఠం ఉండి ఉండవచ్చును. **"కృపయా కేవలమాత్మ సాత్కురు"** అనే స్తోత్రరత్నసూక్తికి ఇది పొసగుతుంది)

**భావము : "భవదీయ ఇతీరయన్"**- నీకు చెందిన వాడను **"తవాస్మి"** అనే శబ్దాన్ని పురస్కరించుకొని నాపట్ల దయను చూపాలి. **"పాపీయసోఽపి శరణాగతశబ్దభాజః"** అనే కూరేశుల అతిమానుషస్తవంలోని సూక్తి స్మరణీయం. **"తదాపీత్థం రూపం వచన మవలంబ్యాపి కృపయా త్వమేవ"** అనే స్తోత్రరత్నసూక్తిని కవి ప్రకృతంలో వివరిస్తున్నాడు. **"కృతజ్ఞః"** అని భగవానుని, **"కృతఘ్నః"** అని తమను ఉద్దేశించి యామునులు స్తోత్రరత్నంలో పలికారు. ఇక్కడ కవి తనను **"అకృతజ్ఞః"** అని నిర్దేశించుకున్నాడు. నేను అకృతజ్ఞుణ్ణి అయినా, నీవు కృతజ్ఞుడవు కదా. **"భవదీయః"**-నీవాడను-అని నేను ఒకమాట పల్కటం చాలదా!- నా విషయంలో దయను చూపడానికి కృతజ్ఞుడవైన నీకు - అని తాత్పర్యం. **"అపరాధసహస్రభాజనమ్"** అనే దానిని **"అశుభస్యాస్పదమపి"** అనే దానిని **"నిఖిలాగసామ్"** అని అనడం ద్వారా కవి సూచించాడు. **"కృపయైవ కేవలమ్"** అనే పాఠం సరసం. **"త్రపయైవ"** అని ఉన్నా సరసమే. సిగ్గు ఏదో కొంచెం నాకున్నది అనే కారణాన్ని బట్టే నా పై దయ చూపాలి-అని భావం. లేక, నీకు చెందినవాడను అని పలికే నేను కష్టపడడం నీకు సిగ్గు అని తలచి నాపై దయ చూపాలి-అని కూడా చెప్పవచ్చు.

**శ్లో॥ సుకృతప్రకృతౌ జనే త్వయా**
**కృతయా కిం కృపయా కృపానిధే!।**
**యది మాదృశి సా విధీయతే**
**తవ కీర్తిర్వద కీదృశీ తదా॥ 31**

ప్ర: కృపానిధే=కృపకు నిధివంటివాడా!, సుకృతప్రకృతౌ=పుణ్యశీలుడైన, జనే=వ్యక్తి విషయంలో, త్వయా కృతయా కృపయా=నీచే చేయబడిన కృపచేత, కిమ్=ఏమి గొప్పతనం? యది=ఒకవేళ, మాదృశి=నావంటివారి విషయంలో, విధీయతే= చేయబడినట్లయితే, సా=ఆ కృప, తవ కీర్తిః=నీ కీర్తి, కీదృశీ=ఎటువంటిదై ఉంటుంది?, వద=చెప్పు.

నన్ను బహిష్కరించు- అని రస్యంగా కవి అంటున్నాడు. **"అపరాధసహస్రభాజనమ్"** అనే స్తోత్రరత్న ప్రయోగానికి బదులుగా ఇక్కడ కవి **"కృతకోటికల్మషమ్"** అని అన్నాడు. **"పతితం భీమభవార్ణవోదరే"** అని 26వ శ్లోకంలో యామునులు అన్నారు. ఈ సూక్తి భావం ప్రకృతంలో కవి మనస్సులో మెదలింది. **"ఆత్మసాత్కురు"** అనే యామునుల ప్రయోగాన్నే చమత్కారంగా **"జగతః అపసారయ"**-ప్రకృతి మండలం ఆవలివైపుకు గెంటివేయి-అని అనువదిస్తున్నాడు కవి. "మీ కోపం నా భాగ్యం"-అని తెలుగు సామెత.

**శ్లో॥ యది వీక్ష్య దదాసి మత్కృతం**
**న మయైవ ప్రతిగృహ్యతే తదా।**
**అథచేన్నిజమాశయం ప్రభో!**
**పరితుష్టః శిరసా వహామి తత్॥ 29**

**ప్రతిపదార్థము :** మత్కృతిమ్=నా కృత్యాన్ని, వీక్ష్య=చూచి, దానికి తగిన ఫలాన్ని, యది దదాసి=నీవు నాకు ఇచ్చినట్లయితే, తదా=అపుడు, మయా=నాచే అది, న ప్రతిగృహ్యతే ఏవ=ఎంత మాత్రం స్వీకరింపబడదు, అథ=ఆ మార్గాన్ని విడచి, ప్రభో=ప్రభూ! నిజం ఆశయమ్=నీకు స్వభావసిద్ధం అయిన మనోధర్మాన్ని (గమనించి, దానిని అనుసరించి), దదాసి=ఇచ్చినట్లయితే, పరితుష్టః=పరిపూర్ణ సంతోషాన్ని పొందినవాడనై, శిరసా=శిరస్సుతో, తత్=దానిని, వహామి=ధరిస్తాను.

**భావము :** ఓయీ! నన్ను నీవు మోసపుచ్చాలని చూస్తున్నావు. పాపాలను చేసిన నీకు విధించవలసిన దండనను మార్చి, ప్రకృతికి ఆవలివైపున ఉన్న మోక్షాన్ని ఇమ్మని అంటున్నావు. నేను నీ మాటలకు ఎంత మాత్రం మోసపోనుసుమా! నీవు చేసిన కృత్యాలను చూచి, దానికి తగిన ఫలాన్ని ఇస్తాను" -అని భగవదభిప్రాయంగా తలచి కవి ఇందులో బదులిస్తున్నాడు. ఫలాన్ని ఇచ్చేటపుడు-ప్రతిగ్రహీత ఉండాలి. అతడు లేకపోతే ఫలప్రదానం అనే కార్యమే సిద్ధించదు కదా! తీసికొనేవారు లేకుండా లోకంలో ఇవ్వగలిగేవారెవ్వరూ లేరే! **"దాతృప్రతిగృహీతాభ్యాం సర్వార్థా స్సంభవంతి హి"** అని వశిష్ఠుడు జనకునితో సీతా వివాహసందర్భంలో అన్నాడు. నా యోగ్యతను చూచి, దానికి తగిన రీతిలో నీవు ఫలాన్ని ఇస్తే అది దుఃఖరూపంగా కదా ఉంటుంది. నీవిచ్చే దుఃఖఫలాలను నేను గ్రహించబోను. నేను గ్రహించకుండా నీ ఫలదానక్రియ ఏ విధంగా సిద్ధిస్తుంది? నీ మనస్సును చూచి, దానిని అనుసరించి, నీవు వేనిని ఇచ్చిన దానిని నేను శిరసా వహిస్తాను. నీ మనస్సు సహజంగానే కరుణాపూర్ణం. నా పాపాలను చూచి నీవు వానిని అనుసరించి ఫలాలను ఇవ్వడం మానివేస్తే, నీ మనస్సు శీతలస్వభావమైనది కనుక, దానిని చూచి నీవిచ్చే ఫలం మంచిదిగానే ఉంటుంది. కనుక దానిని సంతోషంగా గ్రహించి తలపై ధరిస్తాను.



ఇక్కడ-**"అధునా గలితహ్రియా మయా భగవన్! త్వాం ప్రతి కిం నిగద్యతామ్"** - నీ ముందు నేను ఏమని చెప్పే అవకాశం ఉన్నది?- అని కవి అంటున్నాడు. **"తవాగ్రే"** అని, **"త్వాం ప్రతి"** అని రెండూ ఒకే అర్థాన్ని ఇస్తాయి కదా! **"క్రందామి"** అనే యాముని ప్రయోగానికి - "పలుకు ఏమి పలుకడానికి అవకాశం లేక, మనస్సులో తోచక కేవలం రోదనం మాత్రం చేస్తున్నాను. మాటలతో కూడిన రోదనం కాదు. ఇది మౌనరోదనం"- అని రస్యమైన భావం-అని ఇక్కడ కవి తన ప్రయోగం ద్వారా ధ్వనింపజేస్తున్నాడు. మాటలాడడానికి నోరు రాలేదు. అవ్యక్తశబ్దంగా రోదించడానికి మాత్రమే నోరున్నది. వ్యక్తంగా కాకుండా వెక్కి వెక్కి ఏడవడం మాత్రమే చేయగల్గినది. మిగిలినది.

**శ్లో॥ మదకామవిమోహమత్సరా**
**రిపవస్త్వత్పుర ఏవ విహ్వలమ్(తావకమ్)।**
**ధృతశార్ఙ్గగదారినందక!**
**ప్రతికర్షంతి కథం న లజ్జసే॥ 25**

**ప్రతిపదార్థము :** ధృతశార్ఙ్గగదా+అరినందక=శార్ఙ్గమనే విల్లు, గద, చక్రం, నందకం అనే కత్తి-అనే ఆయుధాలను ధరించి, ఆశ్రితులకు భయం పోగొట్టి ఆనందింపజేసే ఓ శ్రీకృష్ణా!, మదకామవిమోహమత్సరాః=అహంకారం, కామం, మోహం, మాత్సర్యం అనే, రిపవః=శత్రువులు, త్వత్ పుర ఏవ=నీముందే, విహ్వలమ్=బలాత్కారంగా నన్ను తమ వశం చేసికొని, ప్రతికర్షంతి=నీ దగ్గరనుండి విడదీసి ఈడ్చుకొని పోతున్నవి, కథం న లజ్జసే=(దీనిని చూచి)నీవు ఎందుకు సిగ్గుపడడం లేదు? నీకే సిగ్గుగా లేదా!

**భావము :** "సిగ్గు విడచి నీ సమక్షంలో నేను ఏమని పల్కగలను?" అని గత శ్లోకంలో పల్కిన కవి, "నేను సిగ్గులేనివాడనే అయినా, నీ ముందే నేను పడే బాధలను చూచి నీవు అయినా లజ్జించవద్దా" అని ఇందులో అంటున్నాడు. **"కిం తు త్వదగ్రే శరణాగతానాం పరాభవో నాథ! న తేఽనురూపః"** (23) అనే స్తోత్రరత్నసూక్తికి ఇది భావమని వివరిస్తున్నాడు కవి. నిన్ను శరణు పొందిన వారికి "నీ సమక్షంలోనే అవమానం కల్గడం నీకు తగినది కాదు" అనే మాటకు "నా అవమానం నీదే, నేను సిగ్గుపడకపోయినా, నీవైనా సిగ్గు పడవలసి ఉన్నది కదా" అని భావం. **"త్వదగ్రే పరాభవః"** అని అన్వయం అనే విషయాన్ని **"త్వత్పుర ఏవ ప్రతికర్షంతి"** అని అంటూ కవి చూపుతున్నాడు. స్వామి సమక్షంలోనే సొత్తు బాధపడడం ఆ స్వామికి అవద్యం కదా అని స్తోత్రరత్నవ్యాఖ్యాత వివరణం. **"త్వదగ్రే"** అనే దానికి "సర్వత్ర సన్నిహితుడవైన నీముందు" అని అక్కడి వివరణం. **"ప్రతికర్షంతి"** దూరంగా ఈడ్చుకొనిపోతున్నవి. కృష్ణుడవైన నీవే ఈడ్చుకొనిపోవడంలో చేయి తిరిగినవాడవని ప్రసిద్ధి. ఆ కృష్ణుని వద్దనుండి నన్ను బలాత్కారంగా ఈడ్చుకొని పోతున్నాయే! నీకంటే వానికి బలం ఉన్నదా! నీ కంటే అవి బలవ్మైన కర్షకాలా! అని ఇక్కడి హార్దభావం. అవతార సమయంలోనే

**"శార్ఙ్గగదాద్యుదాయుధమ్"** అని ఆయుధాలతో అవతరించిన తీరును శుకమహర్షి వర్ణించినట్లు పలుకుతున్నాడు. **"అరి"** అంటేనే చక్రం. అరాలను కల్గినది –అని అర్థం. శుకమహర్షిసూక్తిక్రమాన్ని కవి అనుసరించాడు. **"అరినందక"** అనే ప్రయోగంలో చమత్కృతి ఉన్నది. నీ ఆశ్రితుణ్ణి అయిన నా శత్రువులను నీవు అడ్డుకోకుండా, వారికి అవకాశాన్ని ఇచ్చి, సంతోషపెడుతున్నావా!" అనే గర్హణ కూడా ఇక్కడ ధ్వనిస్తుంది.

**శ్లో॥ అయి!గర్తముఖే గతః శిశుః**
**పథికేనాపి నివార్యతే జవాత్।**
**జనకేన పతన్ భవార్ణవే**
**న నివార్యో భవతా కథం విభో॥ 26**

**ప్రతిపదార్థము :** అయి=అయ్యో!, గర్తముఖే గతః=లోతు అయిన గుంట దగ్గరకు వెళ్ళి, అందులో పడబోతున్న, శిశుః=శిశువు, పథికేన అపి=అతనితో సంబంధం లేశంకూడా లేని దారిలో పోతున్నవానిచే సైతం, జవాత్=సంభ్రమంతో వేగంగా, నివార్యతే=అడ్డుకొని, రక్షింపబడుతున్నాడు, విభో=అంతటా వ్యాపించి ఉండే ప్రభూ!, భవార్ణవే=సంసార సముద్రంలో, పతన్=పడే(నేను), జనకేన=తండ్రి అయిన, భవతా=నీచే, కథం న నివార్యః = ఏ విధంగా అడ్డుకొని రక్షింపబడకుండా ఉండవచ్చు? నీవే చెప్పు.

**భావము : "త్వదీయస్త్వద్భృత్యస్తవ పరిజనస్త్వద్గతిరహమ్"** అని అన్నట్లు ఇంతవరకు స్వామితో తనకు గల పలు సంబంధాలను ప్రస్తావించాడు కవి. **"పితా త్వం మాతా త్వమ్"** అనే రీతిలో గర్భసంబంధాన్ని ప్రస్తుతిస్తూ, భగవానునితో వాదులాడుతున్నాడు ఇందులో. నన్ను కన్న తండ్రివి కదా నీవు. **"పితాహమస్యజగతః"** అని నీవే అన్నావే! ఒక చిన్నబిడ్డ గోతిలో పడబోతున్నపుడు ఆ దారిలో పోయే సంబంధం లేని బాటసారి కూడా భయంతో అఱచి, చూచి ఊరుకోలేక, వేగంగా పోయి అడ్డుపడి కాపాడతాడు కదా! నేను సంసారసముద్రంలో పడి తల్లడిల్లుతున్నాను. సహాయపడేవారు, దరి చేర్చేవారు ఎవరు ఉన్నారు? అని సముద్రమధ్యంలో మునిగిపోబోయే నావలో ఉన్నవారు అలమటించేటట్లు అలమటిస్తున్నాను. నాకు తండ్రివి అయిన నీవు అంతటా వ్యాపించి ఉండే విభుడవు. సర్వదా సర్వత్ర ఉన్నావు. అయినా నన్ను నీవు కాపాడకుండా ఉండడం తగునా! చెప్పు.

**శ్లో॥ సుకృతప్రియ! మాఽన్యథాస్తు తే**
**సుకృతిభ్యస్సుఖదస్య సుప్రథా।**
**అపి పాపమబిభ్రతస్తు మాం**
**తవ విశ్వంభరనామ దుర్లభమ్॥ 27**



**ప్రతిపదార్థము :** సుకృతప్రియ=ధర్మాన్నే ప్రియంగా కలవాడా! సుకృతిభ్యః=పుణ్యాత్ములకు, సుఖదస్య=సుఖాన్ని ఇచ్చే, తే=నీ, సుప్రథా=గొప్ప కీర్తి, మా అన్యథా అస్తు=వేఱు విధంగా కాకూడదు, ఆ విధంగానే గొప్పగా ఉండాలి, పాపమ్ మామ్ అపి=పాపి అయిన నన్ను కూడా, అబిభ్రతః తవ=నీవు భరించకపోతే, విశ్వంభరనామ=విశ్వాన్ని అంతటినీ భరిస్తున్నావనే పేరు, తవ=నీకు, దుర్లభం తు=అరుదే కాగలదు సుమా!

**భావము : "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"**–ధర్మసంస్థాపన కోసం ప్రతియుగంలో అవతరిస్తున్నాను–అని అన్నావు. వేదవిదులు, ఆధ్యాత్మజ్ఞానవిదులు శ్రీకృష్ణుడే సనాతనధర్మం–**"యే చ వేదవిదో విప్రాః యే చాధ్యాత్మవిదో జనాః, తే వదంతి మహాత్మానం కృష్ణం ధర్మం సనాతనమ్"** అని అన్నారు. సుకృతులకు నీవు సుఖాన్ని కల్గిస్తావు అనే ప్రసిద్ధిని నీవు నా విషయంలో మార్చబోకు. ధర్మాత్ములను నీవు కోరిన రీతిలో భరించు, పాపి అయిన నన్నుకూడా నీవు భరించకపోతే **"విశ్వంభరు"**డవనే నీకున్న ప్రసిద్ధనామం నీకు దుర్లభం అవుతుంది. నీ పేరుకు కొఱత రావచ్చునా? **"విశ్వం బిభర్తి భువనస్య నాభిః"** అనే వేదవాక్యాన్ని అసత్యం చేయవచ్చునా?

**శ్లో॥ వచనైః పరుషైరిహ ప్రభో!**
**యది రోషం సముపాగతోఽసి మే।**
**ముఖరం కృతకోటికల్మషం**
**కరుణాబ్ధే! జగతోఽపసారయ॥ 28**

**ప్రతిపదార్థము :** ప్రభో!=ప్రభూ!, ఇహ=ఈ లోకంలో, మే=నాయొక్క, పరుషైః=కఠినాలైన, వచనైః=పలుకులతో, రోషమ్=కోపాన్ని, యది సముపాగతః అసి=నీవు అధికంగా పొందినవాడవైతే, కృతకోటికల్మషమ్=కోట్లాది సంఖ్యలో అపరాధాలను చేసినవాడను, ముఖరమ్=అధికంగా పలికేవాడను అయిన నన్ను, కరుణాబ్ధే=ఓ కరుణాసముద్రా!, జగతః =ఈ ప్రకృతి మండలంనుండి, అపసారయ=తొలగించివేయి.

**భావము :** పాపిని ఏ రీతిలో భరించడం? **"ఆజ్ఞాచ్ఛేదీ మమ ద్రోహీ"** (నా ఆజ్ఞను అతిక్రమించేవాడు నాకు ద్రోహం చేసినవాడే అవుతాడు) అని కదా నాకు రోషం కల్గుతుంది"– అని శ్రీకృష్ణుడు అడిగినట్లు తలచిన కవి ఇందులో దానికి బదులు పల్కుతున్నాడు. "రాజద్రోహి వీడు" అని నీకు నాపై పూర్ణమైన కోపం కలుగుతుంది. సందేహం లేదు. ఆ రోషంతో నన్ను నీ ప్రకృతి మండలం నుండి, నీ లీలావిభూతినుండి బయటకు గెంటివేయ వచ్చునే! మరణదండన అయితే నాకు నీవు విధించలేవు. నీ నిత్యేచ్ఛచేత నేను నిత్యుడను. **"న మ్రియతే విపశ్చిత్"** అని నీవే పలికావు కదా! ఇక, మరణదండన వీలుకానపుడు, దానితో సమానమైనది దేశబహిష్కార దండన. నగరంనుండి బహిష్కరించి, ద్వీపాంతరవాస శిక్షను విధించడం. కనుక, ఈ ప్రకృతిమండలంనుండే

ఈ

వ్యాఖ్యానగ్రంథం

మక్కెన అన్వితగారి

ఆర్థిక సహాయముతో

ముద్రింపబడినది.

శ్రీః

పండితరాజజగన్నాథవిరచితా

# కరుణాలహరీ

నాగమాతా వ్యాఖ్యాసమేతా

డా॥ ఈ.ఏ.శింగరాచార్యులు

సంపాదకుడు

రా మో రా

4-103, ILTD కాలనీ ఎక్స్‌టెన్షన్,

కొత్తపేట-చీరాల-523157